# సెగ

## తెలంగాణ కవిత్వం

జూలూరు గౌరీశంకర్

మా అమ్మా నాన్నలు యార్లగడ్డ కస్తూరి, రామనాథంల
60వ వివాహ వార్షికోత్సవం సందర్భంగా
ఈ పుస్తక బహూకరణ
ఫాంట్‌లైన్ (యార్లగడ్డ) నిర్మల, వై. సుబ్బారావు,
వై.వి.(సిపిఎం రాష్ట్ర కార్యదర్శివర్గ సభ్యులు), వై.వి. రమేష్
17-05-2012

తెలంగాణ రచయితల వేదిక
హైదరాబాద్
2008

# సెగ

తెలంగాణ కవిత్వం

ప్రచురణ కాలం : 2008



ప్రచురణ : తెలంగాణ రచయితల వేదిక

కవర్ పేజి ఫొటో,
అక్షరాలు : ఏలే లక్ష్మణ్

ప్రతులకు : రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో
**జూలూరు గౌరీశంకర్**
జర్నలిస్ట్, సంపాదకుడు,
1 8 702/33/20ఎ
పద్మాకాలనీ, నల్లకుంట,
హైదరాబాద్ 500 044

వెల : రు. 40/-

కంపోజింగ్ : ఫాంట్‌లైన్ (గ్రాఫిక్స్)
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 44
ఫోన్ : 27660000

ముద్రణ : విప్ల కంప్యూటర్ సర్వీసెస్
అండ్ మల్టీకలర్ ఆఫ్‌సెట్ (ప్రింటర్స్)
హైదరాబాద్ 44 ఫోన్ · 27676910



ఒళ్లంతా తెలంగాణగా నిత్యం పులకించే,

పలవరించే, కలవరించే,

ప్రొ॥ ఎ. వినయ్‌బాబుకు

మూడున్నరకోట్ల తెలంగాణ ప్రజల ఆకాంక్షకి

అంకితం

## సెగ లోనికి...

# కవిత్వంలో యుద్ధ తంత్రం

*ఇవాళ్టి సందర్భం తెలంగాణ.*
*ఇవాళ్టి సన్నివేశం తెలంగాణ.*
*సకల వర్గాలు, సకల పార్టీలు*
*జైకొట్టక తప్పని నినాదం తెలంగాణ*

ఈ అనివార్య సామాజిక సందర్భం నెలకొనడానికి తగిన నేపథ్యాన్ని రూపొందించడంలో ఉద్యమాలకి ఎంత పాత్ర వున్నదో, కవిత్వానికీ అంతే పాత్ర వుంది. తెలంగాణ ఉద్యమానికి పాదు చేయడంలోనూ, అది ఎదిగి దశదిశలా వ్యాప్తిచెందడంలోనూ తెలంగాణ కవిత్వం కీలకపాత్ర వహించింది. నాయకత్వాన్ని నిలదీసింది. నిర్దేశించింది. దారి తప్పడం తగదని హెచ్చరించింది. ఏ దారిలో వెళ్ళాలో సూచించింది. ఈ అంతటి ప్రక్రియలో జూలూరు గౌరీశంకర్‌ది ప్రత్యేక పాత్ర. కనురెప్ప వేయకుండా ఉద్యమాన్ని కాపాడే కావలికారుని పాత్ర అతనిది. ఆరంభంలోనే ఉద్యమ దిశని గుర్తించి 'నా తెలంగాణ' అంటూ దీర్ఘకావ్యాన్ని వెలువరించి తన కవిత్వ ప్రయాణాన్ని సూచించాడు. తెలంగాణ రస్తా ఎలా రూపొందాలో మార్గనిర్దేశం చేసాడు. తెలంగాణ ప్రజలు కలలుగంటున్న తెలంగాణ స్వరూపాన్ని చూపాడు. ఇక అన్యాయాలని సహించేది లేదని పుష్కరకాలం కిందటే తెగేసి చెప్పాడు.

గౌరీశంకర్ కంఠస్వరం కాలం గడుస్తున్నకొద్దీ పదునెక్కింది. పదేపదే తెలంగాణని కలవరించింది, పలవరించింది. ఎక్కడవున్నా, ఎవరితోవున్నా, ఏం చేస్తున్నా తెలంగాణ ప్రస్తావన అనివార్యం. అతని జీవితంలో, జీవన విధానంలో తెలంగాణ విడదీయరాని భాగమైంది. కొందరు కాలక్రమాన బతుకు ఒరవడిలో కొట్టుకుపోయి కలాన్ని దించుతారు. కవిత్వాన్ని కాస్సేపు పక్కనబెట్టి మరేదో రంధిలో పడిపోతారు. కాని గౌరీశంకర్ స్వభావం ఇందుకు విరుద్ధం. కలలోనూ, మెలకువలోనూ, మాటలోనూ, చేతలోనూ తెలంగాణని

నినదించడం అతని రక్తనాళాల్లో అంతర్భాగమైన అంశం. తెలంగాణ ప్రాంతాల్లో తిరుగాడినప్పుడు ఒక మాట, బయటికి వెళ్ళినప్పుడు మరోమాట మాట్లాడటం కొందరి రివాజు. గౌరీశంకర్‌ది మాత్రం ఎక్కడికెళ్ళినా ఒకటే రివాజు, అంతే పదునుగా, అంతే ఖచ్చితంగా, మరింత నిర్దిష్టంగా మాట్లాడే మాట-తెలంగాణ. తెనాలిలో ఆంధ్ర ప్రాంతంవారిని నిలదీయడంలోనూ, శ్రీకాకుళంలో కాశీపట్నం రామారావుని తెలంగాణపై మీరెటువైపో తేల్చి చెప్పండని ప్రశ్నించడంలోనూ, చీరాలలో సభాధ్యక్షత వహించి 'తెలంగాణ' కవిత్వం మేలిమి గురించి స్పష్టాతిస్పష్టంగా మాట్లాడటంలోనూ గౌరీశంకర్ తెలంగాణ నిబద్ధతలోని పదును ఏమిటో చెప్పకనే తెలిసిపోతుంది. మనసా, వాచా, కర్మణా తెలంగాణ నినాదానికి అంకితమైన దృఢత్వాన్ని తెలియజేస్తుంది. ఇంతటి అమేయమైన శక్తి, రాజీపడని తత్వం, కచ్చితమైన స్వభావం, సూటిగా, పదునుగా తెలంగాణ కోసం నినదించడం గౌరీశంకర్ కవిత్వంలో మరింత విస్పష్టంగా కనిపిస్తుంది. ఎవరేమనుకుంటారోననే జంకు లేదు, శషభిషలు లేవు. చెప్పాలనుకున్నది చెప్పి తీరాలనే నిశ్చయత్వం గౌరీశంకర్ కవిత్వానికి బలాన్నిచ్చింది. పుష్కరకాలంగా తెలంగాణ కవితా వస్తువుకి జవజీవాల్ని అందించడంలో గౌరి కృషి అచంచలమైంది. 'నా తెలంగాణ'ని వెలువరించి ఆగిపోలేదు. 'హమ్మయ్య, దీనితో నా పేరు నిలబడుతుంది ఇక చాల్లే' అని ఊరుకుండిపోలేదు. తెలంగాణ సాధనే లక్ష్యంగా తను ప్రయాణించడమేకాదు, మొత్తం తెలంగాణ సాహిత్యాన్ని తను నిర్దేశించుకున్న తెలంగాణ ఎజెండా చుట్టూ మలుపు తిప్పడమే గౌరీశంకర్ సాధించిన అతి పెద్ద విజయం. 'పొక్కిలి'తో తెలంగాణ కవులకి ఎజెండాని ఇచ్చాడు. ఇవాళ్టి కవితావస్తువు, మొత్తం సాహిత్య వస్తువు తెలంగాణ అని తన రచన ద్వారా, కార్యాచరణ ద్వారా ప్రకటించాడు. ఈ ప్రాంతంలోని సాహిత్య వ్యాసంగమంతా తెలంగాణ చుట్టూ తిరుగాడక తప్పని స్థితిని కల్పించడంలో గౌరీశంకర్ సఫలమయ్యాడు. ఒక సాహిత్య కార్యకర్తగా వుండి చేయాల్సింది చేస్తూనే తన కవిత్వాన్ని మరింత పదునుపెట్టుకున్నాడు.

తెలంగాణ ప్రయాణం ఏ దిశగా సాగాలో, తెలంగాణ ఉద్యమం ఏ వైపుగా నడవాలో తన కవిత్వం ద్వారా నిరంతరం చెబుతూ వచ్చాడు. "పైపై కరచాలనాలు వద్దు/మనసులొకటి బయటికొకటి/నన్ను కోసినా కనపడదు" అంటూ తెలంగాణపై తన వైఖరిని స్పష్టాతిస్పష్టంగా చెప్పిన సందర్భాలున్నాయి. తెలంగాణ సామాజిక, రాజకీయ, సాంస్కృతిక అంశాలన్నిటిపై

అతనిది నిరంతర కవితా వ్యాఖ్యానం. తెలంగాణలో ఒక కొత్త పరిణామం. కొత్త సంఘటన, కొత్త సందర్భం ఏర్పడగానే దీనిపై గౌరీశంకర్ కవితాస్పందన ఎలా వుంటుందోనని కవిత్వాభిమానులు ఆలోచించే పరిస్థితి కల్పించాడు. రాజకీయ నాయకులకన్నా వేగంగా, చురుకుగా స్పందించే స్వభావం గౌరీశంకర్‌లో వుంది. లోక్‌సత్తా జయప్రకాశ్ నారాయణని ప్రశ్నించడంలో, కె.సి.ఆర్.ని యుపిఏ నుంచి పదవులకి రాజీనామా చేసి బయటకు రమ్మనడంలో, 'కాకా ఇది ఆఖరు మోక' అంటూ కాంగ్రెస్‌నేతని నిలదీయడంలోనూ, ఎర్రజెండా ఎటువైపో తేల్చి చెప్పాలనడంలో అతనిలోని చురుకయిన స్పందనా నైజాన్ని గమనించవచ్చు. సందర్భం ఏదైనా దానిని కవితామయం చేసి తన వాణిని వినిపించే ధోరణి క్రమంగా గౌరీశంకర్‌కి పట్టుబడింది. ఇదేదో సాధన చేసి నేర్చుకున్న విద్య కాదు, కాలమే నేర్పింది. ఇవాళ్టి తెలంగాణ సందర్భమే తన వ్యక్తీకరణకు గౌరీశంకర్‌ని ఎంచుకున్నదేమో! లోపల ఒకటి, బయట ఒకటి లేని అచ్చమైన తెలంగాణ అమాయకపుతనం అతని కవిత్వంలో కనబడుతుంది. పర్యవసానాల్ని లెక్కించే లౌక్యం లేదు. చెప్పాలనుకున్నది చెప్పి తీరాలన్న గుణంవల్ల అతని కవిత్వానికి నిసర్గత అబ్బింది. ఈ చెప్పడంలోనూ గొప్ప ఆత్మవిశ్వాసాన్ని కనబరుస్తాడు. మాకు అన్యాయం చేస్తున్నారన్న వగవు వుండదు, వివక్ష చూపించారని కుమిలిపోవడం వుండదు. చేసిన నిర్వాకానికి క్షమాపణలు చెప్పాలని గంటా బజాయించి అడుగుతాడు.

*"నానుంచి గుంజేస్కున్నదానికి జవాబులు రావాలి*
*చరిత్రకు బహిరంగ క్షమాపణ చెప్పి*
*ఆక్రమణ తత్వానికి నీళ్లొదలాలి"*

అంటూ ఆంధ్ర పెత్తందారుల్ని నిలదీస్తాడు.

తెలంగాణ రాజకీయాల్ని, తెలంగాణ మీద రాజకీయాలు చేస్తూ ఆటలాడుకునే వారి మోసకారితనాన్ని నిరసిస్తాడు. కాంగ్రెస్ పార్టీ చేసే దగానీ, కుటిల పన్నాగాలనీ నిస్సంకోచంగా విమర్శిస్తారు.

"హైకమాండ్ భిక్షక్కర్లే/ఎవని ఓదార్పులక్కర్లే/సారీ....సెకెండెస్సార్సీ/అసలు రంగు బయటపడ్డది" అంటూ కాంగ్రెస్ కపటత్వాన్ని కడిగిపారేస్తాడు. లాబీయింగ్‌ల ద్వారా తెలంగాణ రాదు, జనంలోకి వచ్చి పోరాటం చేయాలి, జనం మధ్య నిలబడాలి అంటూ కెసిఆర్‌ని

హెచ్చరించారు, అప్రమత్తం చేశారు. కవి మాటని ఔదాల్చక తప్పని పరిస్థితి కాబట్టే ఉద్యమబాటలో ప్రయాణించడం కెసిఆర్‌కీ, టిఆర్ఎస్‌కీ అనివార్యమైంది.

"కేసిఆర్...కేసిఆర్...

నువ్వెన్ని బొంతపురుగుల్నైన ముద్దుబెట్టుకో లాబీయింగ్ తెలంగాణ జోలికొద్దు" అని కచ్చితంగా చెప్పడంలో కవి అవగాహన పరిణతి, ఆత్మవిశ్వాసపు గాంభీర్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తాయి. ఇలా తెలంగాణ నాయకుల కార్యాచరణని నిర్దేశించే గుండెధైర్యం గౌరీశంకర్‌లోనే ప్రబలంగా చూస్తాం. ఎదుటివారి స్థాయి, హోదా ఏమిటనికాక మనసులోని మాట చెప్పితీరాలనే తత్వమే కవిగా తెలంగాణ సాహిత్య లోకంలో అతనిని ప్రత్యేకంగా నిలబెట్టింది. అడుగడుగునా సందర్భం వచ్చిన ప్రతిసారి, లేదా సందర్భాన్ని తనే సృష్టించుకొని తెలంగాణ గురించి మాట్లాడతాడు గౌరి. "ఈ మట్టి కాసింత ఒంటికి పూసుకుంటే జాతీయ నేతలైతరు" అనే నిజాన్ని నిక్కచ్చిగా చెబుతాడు. తెలంగాణ చెట్టు పేరు చెప్పి కాయలమ్ముకునే కమ్యూనిస్టుల దొంగనీతిని ప్రశ్నిస్తాడు. "ఓ ఎర్రజెండా నువ్వు ఎటు దిక్కో తేలాలిప్పుడు" అంటాడు. త్యాగాలు చేసిన పోరాటాల చరిత్ర వుంది. కాబట్టే "మా బాధలు తీర్చే ఓదార్చే/కట్టమైసమ్మవు కావే ఓ నా ఎర్రజెండా/పోరాట జాగపైన రియల్‌స్టేట్‌ల్ని తుడిసేయవే తల్లీ" అనడం ద్వారా కమ్యూనిస్టుల మీద లోలోపల వున్న మమకారాన్ని వ్యక్తం చేస్తాడు.

*"ఈ నేలపై ఏ ఆధిపత్యం సెల్లదని సెప్పవే ఎర్రజెండా*
*మూడుకోట్లమంది పక్కన నిలువవే ఎర్రజెండ"*

అని కమ్యూనిస్టులు ప్రయాణించాల్సిన మార్గాన్ని సూచిస్తాడు. అలాగే "ఈ దుమ్ముల తిరిగినందుకేగా/వినోబా భూదానోద్యమమైంది" అంటూ చారిత్రక దృష్టిని ప్రదర్శిస్తాడు.

"దున్నేవాడికే భూమి" లక్ష్యంగా తెలంగాణ సాయుధ పోరాటం జరగకపోతే 'భూదానం' అనే ఆలోచన వినోబాకి రాకపోయేది. వినోబా భూదాన ఉద్యమకర్తగా నిలవడానికి తెలంగాణ ప్రజాచైతన్యమే తోడ్పడింది.

తెలంగాణని అంతర్జాతీయ దృష్టితో చూసి పాలస్తీనాతో పోల్చడం మరో విశేషం. పాలస్తీనా, తెలంగాణ డిమాండ్లు విభిన్నమైనవి. పాలస్తీనా స్వతంత్ర దేశంగా వుండాలన్నది అక్కడివారి ఆకాంక్ష. ఇజ్రాయిల్ దురాక్రమణపైనే వారి పోరాటం. ఇక్కడ తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కావాలన్నది ఆకాంక్ష. అయినప్పటికీ రెండింటికీ మధ్య సారూప్యతలున్నాయి.

1. మొదట్నించి పాలస్తీనా స్వతంత్ర దేశం. సామ్రాజ్యవాదుల కుట్రల, ఆధిపత్యాల ఫలితంగా ఇజ్రాయిల్ ఆవిర్భవించి పాలస్తీనాని ఆక్రమించింది. అరబ్ ప్రపంచాన్ని తమ కనుసన్నల్లో వుంచుకోవాలనుకున్న అమెరికా పన్నాగమే ఇజ్రాయిల్ సృష్టికి కారణం. కనుక పాలస్తీనా విముక్తి కోసం అక్కడ పోరాటం అనివార్యమైంది

2. సరిగ్గా మరో రూపంలో ఇక్కడా అదే పరిస్థితి వుంది. తెలంగాణ ప్రాంతం ఏనాడూ ఆంధ్రలో భాగం కాదు. చారిత్రకంగా, భౌగోళికంగా, సాంస్కృతికంగా తెలంగాణ ప్రత్యేక ప్రాంతం. గోల్కొండ సుల్తానుల, నైజాం నవాబుల పాలనలో తెలంగాణ ప్రాంతానికి తనదయిన ప్రత్యేక అస్తిత్వం ఏర్పడింది. నైజాం పాలనలోని దుర్మార్గాన్ని ప్రజలు వ్యతిరేకించారు. కానీ కోస్తాంధ్ర ప్రాంతంలో కలిసి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడాలన్న వాంఛ తెలంగాణవాసుల్లో ఏ కోశానా లేదు. అయినా హైదరాబాద్ రాష్ట్రాన్ని బలవంతంగా ఆంధ్రప్రదేశ్‌లో విలీనం చేశారు. ఇచ్చిన హామీల్ని ఏడాది తిరగకముందే ఉల్లంఘించారు. ఈ కారణంగానే తెలంగాణలో అసంతృప్తి జ్వాల పెల్లుబికింది. ఇతర ప్రాంతాలవారు ఈ నేలమీదకు వచ్చి పెత్తనం చెలాయించడం, వనరులు దోచుకోవడం ఏమిటనే ఆత్మగౌరవ సమస్య తలెత్తింది. ఈ నేపథ్యమే తెలంగాణ స్వతంత్ర రాష్ట్రం ఏర్పడి తీరాలన్న ఆకాంక్షని బలీయం చేసింది. విభిన్నరూపాల్లో పోరాటాలకి తెలంగాణలోని సకల వర్గాల వారిని సమాయత్తం చేసింది. ఈ కారణంగానే గౌరి తెలంగాణని పాలస్తీనాతో పోల్చాడు. అరాఫత్‌కు జేజేలు పలికాడు. 'నా నేల ఒక పాలస్తీనా అడుగు' అని నిర్ద్వంద్వంగా ప్రకటించాడు.

"ఎడారి నాలుక తడారకుండా

వొంటిని కోసిచ్చిన ఒంటె అరాఫత్" అన్న ఇమేజరీ అత్యంత శక్తివంతమైంది. ఆలోచనలో, అవగాహనలో, ఆకాంక్షలో మొక్కవోనితనం వల్లనే ఇలాంటి పదునైన భావచిత్రాలు గౌరీశంకర్ కవిత్వంలో చోటు చేసుకున్నాయి.

"నువ్వెప్పుడూ ఇజ్రాయిలే
నేనేమో పాలస్తీనా పదాన్ని
*ప్రపంచపటంలో నాది వీర స్వతంత్ర తెలంగాణ"*

అని చాలా సగర్వంగా, ధైర్యసాహసాలతో ప్రకటించే అరుదయిన ఆత్మవిశ్వాసం గౌరీశంకర్‌లోనే చూస్తాం. విప్లవ కవిత్వ సంప్రదాయంలోంచి వచ్చిన తెగువ, నిస్సందేహమైన విశ్వాసం గౌరి తెలంగాణ కవిత్వానికి బలాన్నిచ్చాయి. శత్రువుపై గురిపెట్టి కవితాస్త్రాల్ని సంధించడంలో

ఏమాత్రం వెరవులేదు. అందుకే గౌరి కవిత్వంలో ఎదురుదాడి చేయటమే తప్ప నంగినంగి మాటలకి తావులేదు.

*"ఇది తెగదెంపుల సంగ్రామం*
*తెగిస్తేనే తెలంగాణ"*

అని నిర్ద్వంద్వంగా ప్రకటించడం విప్లవ సంప్రదాయం నుంచి వచ్చిన కవికే సాధ్యం. దళితవాదమైనా, బిసివాదమైనా, ప్రాంతీయ పోరాటమైనా తను నమ్మినదాన్ని ప్రగాఢంగా ఒక పెద్ద క్యాన్వాస్‌తో ప్రకటించడం గౌరి కవిత్వంలోని ప్రధాన ఆకర్షణ.

*"ఆధిపత్యానికి అంతం పలికే మహా వాక్యాన్ని నేను*
*తెలంగాణ పోరాటాల ప్రయోగశాలను"*

అనే మాట ఒక మామూలు కవి అనలేడు. ఆవేశం, ఉద్వేగం, తెగింపు, సాహసం వున్న కవి నుంచే ఈ కవితాపాదాలు వస్తాయి. ఈ లక్షణాలన్నీ గౌరీలోనూ, గౌరి కవిత్వంలోనూ వున్నాయి. గౌరి బహిర్ముఖుడు. ఔట్ స్పోకెన్ పర్సన్, లోపల ఏదనిపిస్తే అది వెంటనే పైకి అనేస్తాడు. కవిత్వంలోనూ ఇదే ధోరణి. ఈ నిర్మొహమాటత్వం, సహజమైన ప్రతిస్పందన గౌరి అభివ్యక్తికి మేలిమి అంశంగానే తోడ్పడింది. కవితా పాదాల్లో నికార్సయినతనం, తాజాతనం, నీళ్ళు నమలని వైఖరి వ్యక్తం కావటానికి ఉపకరించింది.

*"ఎవ్వరూ ఏ రూపంలో వచ్చినా గెలుపు మాదే!*
*జొన్నకంకుల*
*తంగేడుపూల పరిమళాల*
*బతుకమ్మపాట నా తెలంగాణ తల్లిదే!"* అనే కవిత్వ పాదాల్లోని నైసర్గిక ప్రేమని చూడొచ్చు.
*"ఇక కాలమే నా కోసం విముక్తి గీతం జపిస్తుంది.*
*కాలం నా కోసం వడిసెలరాయి అవుతుంది"* అనే మాటలు కవికి వున్న దార్శనికతని సూచిస్తాయి.

తెలంగాణ విషయంలో తెరవెనుక ఎవరెన్ని కుట్రలు చేసినా, ఎన్ని కుటిల వ్యూహాలు పన్నినా, వాటిని ఎప్పటికప్పుడు గమనిస్తున్నా, ద్రోహ పాత్ర పోషించేవారిని ఒక కంట కనిపెడుతూనే కాలం తనకు సానుకూలంగా నిలవగలదన్న నమ్మకాన్ని గౌరి ప్రకటించడం ఆశ్చర్యం కాదు. ఎందుకంటే చరిత్రగతిలో మార్పు అనివార్యమైన మార్క్సిస్టు సూత్రాల్ని అంతర్లీనంగా జీర్ణించుకున్న కవి గౌరి. ఉద్యమాల వెల్లువని గమనిస్తూ, వాటిలో లీనమవుతూ

ప్రయాణిస్తున్న మనిషికి వుండాల్సిన ముందుచూపు గౌరిలో ఉంది. ఇది అతనికి తెలియకుండానే అతని కవిత్వానికి పదునైన శక్తిని అందించింది.

ప్రపంచీకరణ నేపథ్యంలో మారుతున్న గ్రామీణ సంబంధాలపై సాధికారికంగా వ్యాఖ్యానిస్తూ గౌరి కవిత్వం రాశాడు. 'నడిగూడెం గిట్లయిందేంది?' అనే శీర్షికతో ఆరంభమైన కవిత్వం ఎత్తుగడలో, నడకలో గ్రామీణ జీవితంలోని మార్పుల్ని చెబుతాడు. మారుతున్న గ్రామీణ, పట్టణ సంబంధాల్నీ, భౌగోళిక స్వరూపాన్నీ దృశ్యమానం చేస్తాడు. ఈ ప్రపంచీకరణకు ప్రత్యామ్నాయాన్ని స్థానికతలోనే చూస్తాడు. అంతిమంగా తెలంగాణ నేల తెలంగాణ వాసులది కావడం ద్వారానే సకల దోపిడీల నివారణకు మార్గం ఏర్పడుతుందనే విశ్వాసం ప్రకటిస్తాడు గౌరి. తనకు సంబంధంలేని 'అభివృద్ధి' తనకు ఎందుకంటాడు.

ప్రపంచీకరణ ప్రభావాల నేపథ్యమే గౌరి చేత "కార్పొరేట్ పిల్లలు కవిత్వం చెప్పే తండ్రులు' ' కవిత రాయించింది. మానవ సంబంధాల్నీ, బతుకు విలువల్నీ ధ్వంసం చేస్తున్న కెరీరిజం చేస్తున్న హాని గుర్తించాడు. తన కన్నా తన పిల్లల జీవితం మెరుగ్గా వుండొచ్చు. కానీ ఏ విలువల నేపథ్యంలో వాళ్ళు పెరుగుతున్నారనే అంశం గౌరిని తల్లడిల్ల జేయడం విస్మయం కలిగించదు. అయితే ప్రపంచీకరణ క్రమంలో మానవ సంబంధాల్లో వస్తున్న మార్పుల్ని అర్థం చేసుకుంటూ తననీ, తన చుట్టూ వున్నవారిని జాగురుకులని చేయడమే కవి కర్తవ్యం. అందులో భాగంగానే గౌరి కవితా వ్యాసంగం కొనసాగుతుంది. ప్రపంచీకరణనే కాదు దోపిడిని సమర్థించే ఏ విధాన్నానయినా వ్యతిరేకించడం గౌరి కవిత్వ ఎజెండాలో కీలకాంశం. ఈ కారణంగానే ఏ వాదం, ఉద్యమం వచ్చినా వాటిలో గౌరి కంఠస్వరం విలక్షణంగా వినిపిస్తుంది. మరీ ముఖ్యంగా ఇవాళ అతని దైనందిన కార్యాచరణలో తెలంగాణదే అగ్రస్థానం. గౌరి కవిత్వంలో వస్తుశిల్పాలకు సంబంధించి విభిన్న అంశాలున్నాయి. వస్తువు తెలంగాణ అని ప్రత్యేకించి చెప్పక్కర్లేదు. అతని కవిత్వ ఎజెండానే తెలంగాణ. కవితాభివ్యక్తిలో మౌఖికపరమైన శైలినే ప్రధానం. వచన కవిత్వం లిఖిత సంప్రదాయానికి తలొగ్గి వుంటుంది. వచన కవిత్వమే రాసినప్పటికీ ఏ సూత్రాలకీ కట్టుబడని తత్వం గౌరిది. మౌఖికపరమైన శైలి, వక్తృత్వధోరణి డామినేట్ చేస్తుంది. ఒక విధమైన వేగం, ఒరవడితో పారకుణ్ణి లాక్కెళ్ళే తత్వం చూస్తాం. ఇది అతని కవిత్వాన్ని సుసంపన్నం చేస్తుంది.

- గుడిపాటి

# పాక్కిలైన తెలంగాణ కవిత్వ పాదం

ఈ మట్టి యుద్ధాన్ని నేర్పింది
ఈ నేల బతుకెందుకో చెప్పింది
ఇదంతా నెత్తురుతో గడ్డకట్టిన నేల
ఈ నేలను యాడనుంచి దున్నినా
పౌరుషం పొగలై లేస్తది

నమ్మితే ప్రాణాలిచ్చి నిలుస్తం
ద్రోహాన్ని ఎంటాడి తెగుద్తం
తెగతెంపుల మాటొచ్చినంక
ఇంగ ఎనక్కి పోయేది లేదు

సంకుచితం ఎవరిదో తేలాలి
నా మాటన్నేను దొంగతనంగా సూసుకొనుడేంది?
మల్లా జనం ఎప్పుడైనా జననమే
జాతర జనం జవం జనం
బలం జనం ఈ నేల అజేయం
ఇది గోడ మీద రాత కాదు
ఇది నేల పాడే పాట
ముక్కోటి గొంతుకల వీణ

జండాల తలలు ఎగరేసిన
పార్టీల ముఖాలకు జీవకళనిచ్చిన ఈ నేల

ఒక్కసారి అడుగుతోంది
తన మట్టికి అండగా నిలబడమంటోంది
ఈ నేల మూగ బాధలు భద్రం
కదిల్తే ఈ భూమి నెర్రెలు బాస్తది

మళ్ళీ ఇక్కడ లొల్లి
ఒక జగడం
ఒక పంతం
ఒక కదలిక
ఎవడో మండిన కడుపుతో ఏ బాధల వొత్తికి నిప్పుపెడ్తడో

ఈడ కరువు నేలపై జనం అలలు
బీడు భూములపై జలం కలలు
ఎన్నేళ్ళైనా ఇక్కడ స్వాతంత్ర్యం మొలక ప్రశ్నే

ఈ పోరాటం చనిపోద్ది బతుకుద్ది
మళ్ళీ భగ్గుమంటది

ఇగో మళ్ళీ చెప్తున్నా
దేశం మొత్తం తిరిగే జండాలూ వినండి
మా అపూర్వ సహోదరుల జగడాలు సూడండి
అంటగట్టిన పెళ్ళి ఈ విశాలాంధ్ర
గడ్డిపరకలకు పోరాట కత్తులిచ్చిన చేతులా
నా నేలను నా నించి గుంజేస్తున్నాయ్!
నా మూతికీ, నా చేతికీ మధ్య అడ్డు ఎవరు?

పైపై కరచాలనాలు వద్దు
మనసులొకటి బయటకొకటి

నన్ను కోసినా కనపడదు
మంది కన్నీళ్ళు మావే అనుకుంటే
ఈ జండాపై రాళ్ళెందుకేస్తారు సెప్పుండి)

మళ్ళీ జనం దండ్లు మొదలైనై
దంచుడాట గురించి మాటలెందుగ్గాని
పగిలిన గుండెలు చాలు మందుపాతరలు

ఇక్కడ సావు కొత్తకాదు
ఈడ ఉద్యమానికి ఊపిరి కావటమే జన్మ
"పూలే"యాలో
"రాళ్లే"యాలో నువ్వే తేల్చుకో
కేసీఆర్ నువ్వంతర్ధానమైపో
పాలస్తీనావై అడుగులేసుకుంటూ రా!
ఎర్రసెలకల్లో మొలకెత్తు!!

నేను తెలంగాణ జాతీయ పక్షిని
ఈ జాతికి జవాబుదారిని
పొక్కిలైన ఈ నేల కవిత్వ పాదాన్ని



# అలసట్లేని అరాఫత్

ఏం పోట్లాట మాది
ఎన్ని పానాలు గాల్లో కల్సిపాయె
ఇంత తండ్లాట మనసుల మూటకట్టుకున్న బతుకులు

ఎన్ని సార్లు ఓటములు
పెనుగులాటల పోట్లాటలు

ఈ ఒంటె దేహం చీల్చి
నా నేల నాలుక తడిపితె చాలు

ఎన్నిసార్లయినా
ఎన్ని ఏళ్ళయినా
నాకు నేను ఊపిరి పోసుకుని ఉద్యమమైత

నన్ను నేను తలుచుకుంటుంటే
మీ గొణుగుడేందిరల్ల

ముక్కు మీద యేల్లక్కర్లే
నా ఇంట్లకి నేనొస్తున్న

పక్కకు బోండి
నా పలుకే పెట్రోలు
నా సూపు మందుపాతర గురి

ఎన్నాల్లు ఏటాడ్తరు సెప్పురి
ఏటకైన ఆటకైన బెర్రలుంటయి
ఇది ఎన్నేళ్ళ తప్పుడాట
ఎన్నెల సూడని సీకటి కోణం
ఎతల కతల కోపపు దుఃఖం

2
ఆయనొక
కడాఖరిదాకా దీర్ఘకాలిక కొట్లాట

అసమానతలపై
గురిపెట్టిన పోట్లాడే ప్రపంచకమాయన

వలస వ్యతిరేక వీధుల్లో ఎగిసే దుమ్ముకు
చిరునవ్వుతో తుపాకినందిస్తడు

ఆయన ఎటుదిక్కు కదిలినా
వలస ప్రపంచం ఒక పక్కకొరుగుద్ది

సిన్నప్పటి సంది సూస్తున్న
గాయన్ని సూసినప్పుడల్లా

ఆయన గొంతు పగిలినప్పుడల్లా
నాలో ఏదో తెలియని ఓ చర్య
పేగు బంధం మెలిదిరుగుద్ది
ఎందుకిట్లయితుందో నాకిప్పుడు సమజయింది

పోట్లాటకి బతుకునిచ్చినోడు
బతుకును నిత్య యుద్ధంగా మలిసినోడు
కలబట్టాన్ని నిత్యావసర వస్తువుని సేయటం
మాటలల్లినంత తేలిక్కాదు

కునుకు లేకుండా
తన నేల కోసం పహారాన్నే
జాతి కళ్ళు సేయటం
అంతర్జాతీయ గీతం

బాంబుల మోతలు ఇని
ఫక్కున నవ్వే బోసి నవ్వులకు ప్రాణమాయన

ఎడారి నాలుక తడారకుండా
వొంటిని కోసిచ్చిన ఒంటె అరాఫత్

నువ్వు చేరాలనుకున్న ప్రపంచం అంచు సివర్లనుంచి
నా చేత్తో నేను గీస్తే అది తెలంగాణ సిత్రపటం
పాలస్తీనా – తెలంగాణ

అరాఫత్‌కు జై
తెలంగాణ నినాదాన్ని తుపాకీలా మోస్తమనే
ఎర్రజెండాలకు జై
మూలుగులకు కోరసిచ్చే పాట ఈ గొంతు

# రాజముద్ర

నీళ్ళు లేకుండ
కన్నీళ్ళతో వచ్చినోళ్ళం
ఊళ్ళ గుండెలు పగిలిపోతుంటె
మా గుండె దండోరా వినిపించినోళ్ళం
దిక్కులేని సూపులతో
బాటకోసం ఎతుక్కుంటూ వచ్చినోళ్ళం
ఈడ ఎన్ని కడుపులు కాలినా
వంకర్లు తిరిగిన వళ్ళు నెత్తురు ముద్దలౌతున్నా
ఇంత ఓపికను మూటకట్టినోళ్ళు
యాడ దొరుకతరు
యీడ సెగలు కక్కుతున్న కోపం
యాడ్నో అరువు తెచ్చుకున్నది కాదు
ఇంతటి పచ్చటి సేల మధ్య
ఎర్ర సెలకల సాక్షిగా
ఒట్టు బెట్టి దండు కట్టినోళ్ళం కదరా
ప్రపంచ బ్యాంకు లాగు దడిపి
రాజ్యం కుర్చీ సిటికినేలి గోటితో మార్చినోళ్ళం కదా
మేం రేషన్ కార్డులడిగితిమా
కాల్తున్న దొక్కలకు
ముష్టి మెతుకులడిగితిమా

మా నీళ్ళు మేం తాగుతం అన్నం
నా భూమ్మీద నా అడుగు అన్నా
నా జాగ నాకియ్యమన్నా
నా అస్థి పంజరాల ఊళ్ళ జండాలు పట్టుకుని
యెవలొచ్చిన మా శ్వాసనిచ్చినం
మా ఊపిరి పోతున్న
నా భూమికి కోట్లకొద్ది పిడికిళ్ళిచ్చినం
దిక్కులేని జనం ప్రాణాలియ్యటమే చూసింద్రు
మా వూరు ఏర్ల నుంచి పారుతున్న నీళ్ళన్ని మా నెత్తుర్లే గందా
ఒకటి సెప్పుండి
మా సెట్ల మీన సిలకల పలుకులు
మా బీడు పొలాల్లో ఎండిన సెట్లు
శాపనార్థాలు పెడుతున్నాయి యినపడుతున్నయా
నా అరుపులన్ని ఏదో కాసేపు ఒర్లి ఒర్లి మూతపడే నోర్లనుకున్నరు కదు
మా మాటలన్ని మరిపిస్తే మరిసి నువ్విచ్చే తైలానికి పడిపోతరనుకున్నర్లే
ఏదో ఒక అధికారం తెర అడ్డుపెట్టగానే అంకం ముగియదు
తెర లేపొచ్చు దించొచ్చు
వేదిక తిరగబడకుండ సూస్కోండి
ప్రేక్షకులన్నీ సూస్తున్నారు
అబద్దాల్నీ ఇంటున్నారు
ఆట మధ్యలో ఆగితే
రాళ్ళతో కొట్టండన్న సూత్రధారినీ నమ్మారు
రెండో ఎస్సార్సీ బుజ్జగింపులు
వాళ్ళ నొసలు చిట్లించటాలు చూశాం
వేషధారులు కొన్ని అంకాలే అని సెప్పి
ఉపాంకాలకు ఉరుకులు పెడుతుంద్రు
జగడం మళ్ళీ మొదలైంది
పీఠాలమీద నుంచి

అధికార కుర్చీల మీది నుంచి
రాజదండాల మాటు నుంచి
తెలంగాణ వీరుల స్థూపాల చాటు నుంచి
నా నేల పాట పాడుతూనే ఉన్నారు
నా గానం చేస్తూనే ఉన్నారు
ఎవరో మధ్యలో పెద్దమనిషి
నా యిల్లు నాకిప్పిస్తానంటె
ఉగ్గబట్టే ఉన్నా
నాకు పీల్చుకునే గాలి లేకున్న
వుద్యమానికి శ్వాసనిచ్చా
నేను అస్థి పంజరంలా చిక్కిపోతున్నా
నా నినాదానికి రక్తమిచ్చా
నా వొళ్లు వొంకర్లు తిరిగినా
మీ పాదాలకు పాదలేపమైన
ఎర్రటెండల్ని వోడించి
తెలంగాణకు పత్ర హరితాన్నయ్యా
వాడు వీడు గేలి సేస్తుంటే
విజయ గర్వంతో జండా పట్టుకున్నా
డబ్బులు గుమ్మరించినా
నా ఖాళీ గుమ్ముల్ని
రాసులతో నింపుతానన్నా
ఖాండ్రించి నెట్టేసిన
ఇంగ ఏ పరీచ్చలో వోడొద్దని
ఏకంగ అసెంబ్లీకే పంపినం
ఎర్రకోటలో నా జండాకు జాగానిచ్చినం
దొంగాటలకిక సెల్లుసీటి
అబద్ధాలింక ఖతం ఖతం

జీరపోతున్న గొంతునించి
పగులుకొస్తున్న ప్రకంపనలు
పెద్దమడుసుల పంచాయితీలెలిసిపోతున్నయ్
రెండవ ఎస్సార్సీలు ప్యాకేజీలవుతున్నయి
ఇక శీతాకాలం ఏడెక్కక తప్పదు
పదవులు మా నల్లగరికలని
మీరొస్తారో రారో తేల్చుకోండి
మాకోసం నిలబడి సస్తరో
తెలంగాణ ఉమ్మిలో కొట్టుకపోతరో
తేల్చుకోండి
అడుక్కునే తెలంగాణ ఇప్పిస్తర
గల్లాపట్టి గుంజిలాగే తెలంగాణ తెస్తర
రచ్చబండకాడికి ఈడ్చుకురాకుండ సెప్తర
నేను కాళోజీ కంటి సూపును
తెలంగాణ నిప్పురవ్వను
అందరనుకుంటున్నర్లే
ఇంగేడ తెలంగాణ అని నసుగుతుండ్రు
గడువు దగ్గరికొచ్చింది
గడపలడుగులేస్తయ్
లడాయి సురువైద్ది
తెలంగాణ రాజముద్రలౌతర?
ద్రోహ నిద్రలౌతర?
మాటల్లేవ్
చర్చల్లేవ్
యుద్ధం మొదలౌతోంది
అంగుష్టాలోత్తుదాం రండి



# 610

చరిత్రను తిరగరాస్తం
తప్పుడు చరిత్ర చెద దులుపుతాం
మీరు రాసుకున్న చరిత్ర రాయిని
నాపైకి విసరకండి

అసలు చరిత్రెవరిది?
చరిత్రకారులు మళ్లీ ఎందుకు
మట్టిగీతల్ని ముద్దాడుతున్నారు
త్యాగానికి ప్రాణంపోసిన అర్థం నేను
పక్కవూరు తప్ప మరో ప్రంపంచం చూడని
ఎట్టి మీద ఎగబడి
అసువులు బాసిన నా అమరులదే చరిత్రంతా
వీరతెలంగాణను ఎర్రని సూర్యుణ్ని చేసిన సేతులివి

నన్ను నేను ఎట్టిడిపిచ్చుకోవాలో తెల్సు
ఎట్టి తనాన్ని ఎగరకొట్టేందుకై ఎంత నెత్తురు
గుమ్మరించానో నాకు గుర్తే
తప్పుడు చరిత్రకార్ల కళ్ళకు గంతలక్కర్లే

భూపంపకాల చరిత్ర దేరానెత్తిందెవరు?
బువ్వకోసం పిడికిళ్ల ప్రస్థానం చేసిందెవరు?

నా పెనుగులాటల పోరును నాయకత్వం చేస్కుందెవరు?
ఇంక బుజ్జగింపులొద్దు
నా వొంటి మీద నీ సానుభూతిచేయక్కర్లే
నా ఆవేశాలపై నిప్పులు చల్లే కమిటిలెన్నన్నా ఏసుకో
దెబ్బపై కారం చల్లే సెకలొద్దు
నా నేలను నాకు పరాయిని చేసిన ఓ పసిడిపూత చరిత్రా

మాకు దొంగకాపురాలు తెల్వవు
ఎదుటోళ్ల బత్కులపై పెత్తనం తెల్వదు

చరిత్ర ఎప్పటికైనా నాదే
చరిత్రే చెప్పుద్దిలే అనటం గోడమీద వాటమే
ఇది ఎవరెన్నన్నా మండే మంటే
దీన్ని ఎంతటి నెత్తుటి గడ్డగానైనా చేయండి
చలించని చరిత్ర నాది

తెలంగాణ పొల్లగాళ్ల వొంటిని తాకకండి
అది ఎప్పుడు పేలే మందుపాతరౌద్దో తెల్వదు
నువ్వెప్పుడూ ఇజ్రాయిలే
నేనేమో పాలస్తీనా పాదాన్ని
ప్రపంచ పటంలో నాది వీర స్వతంత్ర తెలంగాణ

నానుంచి గుంజేస్కున్న దానికి జవాబు రావాలి
చరిత్రకు బహిరంగ క్షమాపణ చెప్పి
ఆక్రమణ తత్వానికి నీళ్లొదలాలి
నా మట్టిమీద నేనెప్పుడైనా చరిత్రను తిరగరాస్తా
ఈ గడ్డపైన ఈ నినాదాన్ని ఎవరిసిరినా
మూడకోట్ల గొంతుల ప్రతిధ్వని

# మోసపోయిన రోజు

చూపులు చీరబడ్డయ్
ఆశలు చెరచబడ్డయ్
ఇది 'మోసపోయిన రోజు'
తాకట్టుకు మళ్ళీ కొత్త ప్రోనోటు

ఇన్ని సార్లు వినయంగా
మోసపోవటం నాతోటే అవుద్దేమో
అసలు నా పేరు మోసగింపపట్టమే
ఎవడు ఏ దారిల ఉండో
ఎవని పంచన ఎవడుండో
ఇన్ని మాటలు ఇన్నంక కూడ
సెకండ్ ఎస్సార్సీకి సై ఎట్లంటవ్
మాటలు కావివి సంకేతాలు

మోసపోయినోడికి జరభద్రమేంది
వాళ్ళంత సమైక్యపాట పాడుతుంటే
మీ తెగింపును తెంచి
తల్లి తెంలంగాణ ఉగ్గుపాల గానమెందుకు చేయరు

మోసపోవటం మన వంతు
మోసగించటం వారి విద్య

ఎస్సార్సీ పెద్ద అబద్ధాల పెద్దబాలశిక్ష
త్యాగాలు
ధైర్యాలు
ఎర్రమట్టి పొక్కిళ్ళు
మూటకట్టుకుని ముందుకు పోదాం
మోసపోయిన రోజును
కాసింత పంచుకుందాం రండ్రి
ఎవరి చేతిల ఏదుంటే అది తీస్కరండి
మన కంటి సూపు కాళోజీ కాడ్నించి కదులుదాం
నెత్తురు రాల్చిన అమరుల స్తూపాలకాడ ప్రతిన

బుజ్జగింపు...బుజ్జగింపు...
మోసగింపు... మోసగింపు...
మధ్యల కొండీలు పెట్టే
కుతంత్రాలు చీల్చుకుంటూ
మోసాలను ఎరక సేసుకుంటూ
పోదాం పదండి

మన మట్టి మీన ఎట్టి పదవులెందుకు
కోటాలకింద కుర్సీలను ఎడం కాల్తో తన్నిరండి

మీకు ప్రాణం పోసిందెవరు
ఊపిరినిచ్చి నేతను చేసిందెవరు
మందిని మించిన అధికారముంటదా?
ఉత్తి అధికారం శ్వాసలేని దేహం

'జెండా'ల నినాదాల్నే వల్లేసుకోండి
జనం చేతిలో 'దండ'ను సూసుకోండి

ఇది దగాలకు దగా
ఇది వంచనకు వంచన
ఈ నేల ఎన్ని సార్లు మోసాలకు గురైందో

హై కమాండ్ల భిక్షక్కర్లే
ఎవని ఓదార్పులక్కర్లే
సారీ... సెకండెస్సార్సీ
అసలు రంగు బయటపడ్డది
నోసలు చిట్లించి పాడే ఎస్సార్సీ పాట
మీ కవళికలర్థమైనయ్

నా నేలపైన సమైక్య పాటా!
నా ఇంట్ల నన్ను పరాయిని సేయటమే సమైక్య మాట
సమైక్యం నాకు విషాలంకారమే
పరాయి పంచ...
పరాయి బాంచ...
పరాయీకరణ...
ఆంధ్రీకరణ... వద్దు...వద్దు...

నా మంచితనాన్ని తక్కువగా సూడొద్దు
హైద్రాబాద్‌కు మట్టెత్తిన కూలీలెవరో తెల్సు
గండిపేటకు చేతులెవరిచ్చిండ్రు
చార్మినార్‌కు రూపమెవరిచ్చిండ్రు
భాగ్యనగరానికి రక్త రేఖలెవరిచ్చిండ్రు
దొరల గడీల అహంకారానికి సమాధానం నేనే
ఫ్యూడలిజాన్ని పొర్లిచ్చి తన్నింది నేనే
భూమిని పంచమన్న సంస్కరణ రూపం నేను
చరిత్రకోసం కాకుండ
నాలుగువేల ప్రాణాలను ధారపోసిన నేల నాది

చరిత్రంతా మాది
అద్దె గొంతు మీది
మాది త్యాగం
మీది మోసం
ఇక
సమైక్య గాటిన కాలాన్ని ఇంకెంత కాలం కట్టేయలేరు
ఇది కాలం కళ్ళు తెరిచిన సందర్భమిది
కళ్ళల్లో వత్తులేసుకొని
కాలమే కంటున్న కాన్పు తెలంగాణ

నేను కవిని
గొంతెత్తి అరిచె స్వేచ్ఛ జీవిని
తెలంగాణ జాతీయ పదాన్ని
ఎత్తుగడలు
ఆవేశం వేర్వేర్లు
కవులు ఆవేశపరులు
ఇప్పుడు తెలంగాణకు కావల్సింది
ఆవేశపు ఊపిర్లు
మోసగించబడ్డవాళ్ళు పాడే జాతి పాట
ఇది మోసపోయిన రోజు
ఇక్కడ్నించే మళ్ళొక్కసారి మేలుకొలుపు
ఎన్నిసార్లు మోసపోయినా పోరాడే శక్తి తెలంగాణదే



# నా నేల ఒక పాలస్తీనా అడుగు

ఎన్నిదార్లేసినా లక్ష్యమే కళ్లు
మనమెందుకు గుమిగూడ్తిమి?
మనం రాశులులేని గుమ్ములెందుకైతిమి?
మనమెంత ఛేదించబడ్డా
ధ్యేయానికి గాయం కానియ్యొద్దు!

అధికారానికి చేతులిచ్చాక
గమ్యానికి సూపుండదు
ఒక మహా ప్రయాణపు దారులు
కసి పాట పాడుతున్న చౌరస్తా.

పోటెత్తాల్సిన ఆలోచనలు
అధికారం బుషర్దేసుకుంటే అంతేమరి
పొక్కిలైన నేలవూటనుంచి
విముక్తిపాటే పొంగాలి

ఈ నేల మన జవం
తెలంగాణే జీవం
మందే మనబలం
మసల్తున్న మంటలకు పదవులతకవు

పెనుగులాటనుంచి వేరుపడితే
బొందిల ప్రాణం పోయినట్టే

విశాలాంధ్రే ఇష్టంలేని పెళ్లైతే
అధికారం పంచుకోవటం అయిష్ట బలత్కారం

కేసిఆర్.... కేసిఆర్....
నువ్వెన్ని బొంతపురుగుల్నైన ముద్దుబెట్టుకో
లాబీయింగ్ తెలంగాణ జోలికొద్దు

సెకండ్ ఎస్సార్సీ
తెలంగాణని కొరికే కోరలు
అధికార కుర్చీలు బైటిడిసొచ్చే చెప్పుల జోళ్లు
యేసే అడుగులకు అధికార జోళ్ళక్కర్లే

లాబీయింగ్ పొలిటిక్స్‌లో రాజీనామాలు
డ్రామాల తెగతెంపులు...
పనికోసం ఎంచుకున్న తండ్లాట
మంది ఆలోచనపై సర్కస్ ఫీట్లొద్దు

పేల్చిన పులిచింతల పైలాన్ ముంగట
నెమలిపురి నేల బోరుమంటుంది
కిష్టపట్టే కష్టాలపట్టె పాట పాడబట్టె

జననాలుకలై మెలగాల్సినోళ్లు
కుర్సీల బంకకు తెలంగాణ నంటకద్దరా?

లక్ష్యమే అంతిమ గమ్యం
అందరూ రాళ్లేస్తున్నా మంది మధ్యలో నిలబడి
ఉద్యమ సిలువెక్కండి
పదవులా?... ప్రత్యేక నేల నినాదమా?
ఇది మీకే కాదు
ఈ నేలపై సెకండ్ ఎస్సార్సీ పాటగాళ్ళకునూ

చైతన్యం తాకట్టుపడదు
నెత్తురిచ్చిన ఈ నేలపై
ఎన్ని తూటాల రోడ్లయినా ఎయ్యండి
వీరతెలంగాణ జై తెలంగాణనే అంటది

బిడ్డా!
మీకు మందుల్లేని రోగమొచ్చిందనుకుంటి
కోలుకుంటుండ్రు....

ఉద్యమం ప్రాణం పోసే ఆక్సిజన్
అధికారం అంతం చేసే ఎయిడ్స్
లాబీయింగ్ ఎప్పుడైనా ఎలక్ట్రికల్ షాకే

ఈ మట్టే దేశానికి పోరాట పాలిచ్చింది

నెమలిపురి, చింతిర్యాల, రేబల్లె
కొత్తూరు, దొండపాడులే
ఒక మహానేతకు నిరసన పాట నేర్పాయి
అధికారం కొంగుకింద
పులిచింతలను కమ్మేయకండి

మన పూళ్ళు బూటకపు ఎన్‌కౌంటర్ల మట్టికావొద్దు
రియాజ్‌లు రివాజులు కావొద్దు
దండుకట్టేందుకు తెలంగాణ సై
లక్ష్యం చూపుకు మరకలంటాయ్
మళ్లీ చైతన్యమై

మనమెంత ధ్వంసమౌతున్నా
పట్టాల్సింది పాలస్తీనా పోరుబాట
మీరు పాలస్తీనా అడుగులైతరా
మంది ఆలోచనకు అర్ధమౌతరు



# దీవించు తెలంగాణ... దీపించు తెలంగాణ

అవ్వా
తెలంగాణ ఎన్నిసార్లు మోసపోతవే
ఎన్ని గోసలు పడ్తవే అమ్మా
ఈ టక్కరోళ్ల
తప్పుడు రాజకీయ విద్యల్ని ఇప్పి సెప్పవే తల్లీ

ఈడ నేల పంపకం కుట్రే
కారే నెత్తుటిపైన అల్లుకున్న నాయకత్వం దగే
బయటోడు.... ఇంటోడు
నా రక్తాన్నే పీల్చబట్టిరి

ఈ మట్టి నేతలకు నిచ్చనాయే
తెలంగాణకు వైకుంఠపాళి

ఈ మట్టి కాసింత
ఒంటికి పూసుకుంటే జాతీయ నేతలైతరు
కాల్మొక్తా....
బాంచన్ దొర అన్న మూగ మాట పక్క నిలిస్తే
కమ్యూనిస్టు మహానేతలైతరు
ఈ దుమ్ముల తిరిగినందుకేగా
వినోబా భూదానోద్యమనేతైంది

ఈ తెలంగాణ పటాన్ని
నెత్తురు లేకుండా నాకెప్పుడు సూపిస్తరు
ఈడ పాదయాత్రలు మొదలుపెడితే
ముఖ్యమంత్రులైతరు

ఈ ఊళ్ళను ఎన్‌కౌంటర్ దిబ్బల్ని సేయనంటే
రాజ్యాన్ని దూసి సేతుల పెడ్తిమి
నా నెత్తిన కాకినాడ ఒట్టుపెట్టి
ఎవరెక్కడ నక్కిండ్రో తెల్సు

నా గాలిని నాకే అమ్మే ఆకాశం నాకొద్దు
నా నేలను నాకే అద్దిల్లు సేసిన వృద్ధిరేట్లక్కర్లే

తల్లీ .. తెలంగాణ
ఏడ్వొద్దు... ఏడ్వొద్దు...
నన్ను మోసాల్ని ఇప్పి సెప్పే కలాన్ని సేసినవ్
దగాల మెడలిరగ్గొట్టే సత్తువ నిచ్చినవ్
గుణపారాల్ని గుణిస్తున్నా
లక్ష్యానికి ఎరుపెక్కుతున్నా
నేను స్వేచ్ఛ జెండాను
నాది ప్రత్యేక నేల
ప్రత్యేక భాష
మాతృ దాస్య విమోచనకు వెళ్తున్న
మమ్ము దీవించవే తల్లీ



# మహావాక్యం

పురుడుపోసుకున్న ఆలోచనల చిగుళ్ళను
తుంచేస్తుంటే
చూస్తూ వదిలేసే కవిని కాను

నన్ను కనికరించని కాలాన్ని పాతి
మహాజనాన్ని బతికించే కవి సంజీవినీని

నా నేలమీద నా మట్టి గురుతుల్ని
ఎవరు చెరిపినా
అంటుకునే మంట కవిని

తీపి మధ్య చేదుగోలీలాంటివాణ్ని
రాజముద్రలకు ప్రశ్నల ఛాతీని చూపే కవిని

ఊరు వాడను కలిపిన కలల కళ్ళివి
రెండు చెకుముకి రాళ్ళమధ్య నిప్పు కవిని
తెలంగాణ మట్టి పాటను
గోసిగుడ్డల అవ్వలకు, అయ్యలకు ఆసరాను

అనాదిగా దాసిపెట్టుకున్న కోపం కొసకు అగ్గిపెట్టి
అరుసుకుంటూ గొంతు తెరిసిన కవిని

నాకిప్పుడు
నా కాలుపెట్టి కట్టుకున్న మట్టి గూడు కావాలి
నా నేల నాక్కావాలి

మనుషుల మధ్య బెర్రలు సెరపాలి
మనసులను చీరుతున్న ప్రపంచీకరణను తరమాలి

నీ ఔట్‌సోర్సింగ్ నాకక్కర్లే...
వెళ్లిపోరా...

ఆధిపత్యానికి అంతం పలికే మహా వాక్యాన్ని నేను
తెలంగాణ పోరాటాల ప్రయోగశాలను



# తెలంగాణ రగల్‌జెండా

నిన్నెట్ల సాదుకున్నం
మా నెత్తురుపోసి ఎట్ల పెంచుకున్నం

నువ్వు
అణగారినోల్లకు అండవని
నేల విముక్తి నేతవని
ఆకలి కడుపుకు బువ్వవని
నెర్రలు బాసిన మట్టికి నీళ్ళవని
నిన్ను పిచ్చిగ ప్రేమించినోణ్ణి
ఈ వెర్రి గొంతుకతో ఎర్రపాట పాడినోణ్ణి

మా కలతలల్ల కష్టాలల్ల
కన్నీళ్ళల్ల కల్లోలాలల్ల
పాడుకున్న పాటకదే నువ్వు
నా మనసు ఎగరేసిన ఎరుపు కదే నువ్వు

మా వాకిళ్ళ నొదిలి
సెట్టు సెలకల్ని బట్టి
ఈ బొందిల పానం
నీ కోసమేనన్నోళ్ల నొదిలి

ఎట్ల బోతవే సెప్పు ఓ నా ఎఱ్ఱజెండా
నన్ను నీకు ఎడబాపేదెవరో సెప్పు రగల్‌జెండా

నా నేలను సెరబట్టినోళ్లపై కదా
దండు కట్టాల్సింది
ఆక్రమణతత్వం మీద కదా
ఎఱ్ఱజెండా కలబడాల్సింది
నా బువ్వలో మన్నుబోసినోడి చెంత
ఎట్ల నిలుస్తవే సెప్పు నా ఎఱ్ఱజెండా
ఎఱ్ఱజెండంటే సాయంకోరినోళ్ళ సేతికఱ్ఱ కదా

నా నేలను నాకిస్తవని కదా
కొడవలికి కంకినైంది
సుత్తి కొడవలి నక్షత్రమైంది

ఈ సేత్తో ఉగ్గుపాలు తాపి కదా
నిన్ను ఎఱ్ఱగా ఎగరేసింది
నా నేల పొత్తిళ్ళలో పెరిగే కదా
దేశానికి ఎఱ్ఱజెండానిచ్చింది

నా నేలను ఉచ్చుల్లో బిగిస్తున్న వాళ్ళ సేతుల్లో
సిక్కినవు కదే ఓయమ్మా

ఓ ఎఱ్ఱజెండా
నువ్వు ఎటుదిక్కో తేలాలిప్పుడు
ఎఱ్ఱజెండాకిది పరీక్షాకాలం
పేగుబంధాల్ని తెగతెంచేటోళ్ళ జోలెందుకే అవ్వ

మా బాధలు తీర్చే ఓదార్చే
కట్టమైసమ్మవు కావే ఓ నా ఎర్రజెండా
పోరాట జాగపైన రియలెస్టేట్‌ల్ని తుడిసేయవే తల్లీ

కసికసిగా ఎర్రెర్రగా
తెలంగాణ పాట పాడవే ఎర్రజెండా
ఆ నాయకత్వం సేతులిడిసిపెట్టి
ఈ ప్రత్యేక పాట పల్లవించవే అమ్మా
ఈ నేలపై ఏ ఆధిపత్యం సెల్లదని సెప్పవే ఎర్రజెండా
మూడు కోట్లమంది పక్కన నిలువవే ఎర్రజెండా
నా ఎర్రజెండాను ఎట్ల ఎగరేయాలో తెలుసు నాకు.
విముక్తి పోరాటమే ఎర్రజెండా మ్యానిఫేస్టో కదా
తెలంగాణ విముక్తి అంటే
ఎర్రజెండా రక్తవర్ణమై రెపరెపలాడదా?



# కార్పొరేట్ పిల్లలు - కవిత్వం చెప్పే తండ్రులు

ఎప్పుడయినా, ఎక్కడయినా
ప్రశ్నల పంట పండితేనే కదా...
పసిమనసుల, పరిశోధనాలయాల కుక్షి నిండేది!
ఒకటే మాట, ఒకటే బాణం అంటే
రాముడి కాలపు మురికి రక్తమే
మళ్లీ పెద్ద ప్రశ్నయై మన ముందు నిల్చుంటుంది.

మూసలో నుండి
పసిమనసులను బయటకు తీసుకురావాలి.
పిల్లలకు ఏంజేప్తే యింటరో
దాన్నెతుక్కోవాలి ముంగట.
వాళ్లకు ధైర్యం కలిగించడానికి
మొదట నాకు నమ్మకం కావాలి.

కళ్లు బావుంటే
చలువ అద్దాలక్కర్లేదు
పదాలు, వాక్యాలు, కావ్యాలు బావుంటే
ప్రతి పదార్థ తాత్పర్యాలక్కర్లేదు.
కాని సమాజపు కళ్లూ బావోలేదు.
నమ్మశక్యం కాని అబద్ధం తప్ప
అసలు నిజం నివురుగా కూడా లేదు.
నిజం ఎక్కడుందన్న ప్రశ్నకు సమాధానం లేదు.
నివరు కింద దాగుందనే ప్రశ్నలే వున్నాయి.

-2-

నా విశృంఖలతకు ఆచ్ఛాదనలు లేవు.
నా కవిత్వానికి ఎల్లలూ లేవు
జీవితం కవిత్వపు వ్యాఖ్యల్లో వుండదు.
కరకు వాస్తవంలో వుంటుంది అన్నమాట నిజమే
ఐతే
జీవితం నన్నెప్పుడూ
మసిపూసి మారేడుకాయ జేస్తూనే ఉంది.
నాకు దృక్పథాన్ని యివ్వడానికి
అప్పుడు మార్క్స్ వుండేవాడు.
దృష్టిని సునిశితం చెయ్యడానికి
బుద్ధుండే వాడు.
శ్వాస కోసం
యాస వుండేది.
ఇప్పుడు...
నా పిల్లల్ని
మర మనుషులనుంచి
మనుషులుగా చెయ్యడానికి
నేనే హ్యూమన్ కంప్యూటర్లో
అప్యాయతల ప్రోగ్రాం రాయను
సత్యవతీ...నా సత్యవతీ
కవిగా తప్పులు పలకలేను.
తండ్రిగా నిజాలు చెప్పలేను.
గ్లోబల్ కత్తుల వంతెన కింద
బతుకీడుస్తున్న వాడిని

-3-

అసలు మనుగడే
వ్యక్తి కెరీరిజం అయితే

సంఘాలెక్కడుంటాయి
ఒరేయ్ శివసాగరూ .
నాకుగా ఏమిచెప్పలేనప్పుడు
ఈ కవిత్వమెందుకురా...
కంకర రాయిలా ..!
నేనంటూ ఏమి యివ్వలేనప్పుడు
ఎందుకురా ఈ అక్షరాల వరద.
ఒరేయ్ ..
నేను నాలుగో కన్నెందుకయ్యానో తెలుసా...
ముండ్లకఱ్ఱ నెందుకయ్యానో తెలుసా...
ఇప్పుడు నేను యింటి నుంచి బయల్దేరుతున్నా..
కాళన్న కళ్లనుండి చూస్తున్నా...
రామన్న ఇంటి భాషలో మాట్లాడుతున్నా...
నా పిల్లలకు మరో ప్రపంచాన్ని చూపడానికి
అద్దాన్ని నగ్నంగా ముందు పెడుతున్నా
చూడాల్సిన దాన్ని...
చూడనివ్వకుండా..
వినాల్సిన దాన్ని..
విననివ్వకుండా..
చేస్తున్న ముసుగులని తొలిగించేందుకు
కొత్త పారం..
కొత్తమాట...
కొత్త కవిత్వం..
మొదలెడ్తున్నా..
ఇప్పుడు
తనను తాను అక్షరాల్లో దహించుకుని
కవి కన్నుముయ్యడమే
కవిత్వానికి పరమార్థం.

# తెలంగాణ పిలుస్తోంది....రా!

జయప్రకాశ్ నారాయణ....

రా....

లోక్‌సత్తా జెండావై వస్తున్నవుగా...రా....

ఎంతమంది ఈదారిన నడుసుంటరు

ఈ మట్టిని సాపుసేసి ఎర్రసెలకల కార్పేట్లు కప్పలేదు

మేం ఎవల్లను ఏమన్లేదు

ఈ నేలపై నడిచే వినోబా

భూదానోద్యమమైంది

భూమిమాత్రం ఎవరి పంచనుందో!

జై తెలంగాణకు నెత్తురు నాదే

వీర తెలంగాణాకు 4 వేల శవాల ఎరువూనేనే

మా మీద గుప్పించిన వరాలన్నీ

కరుకునేల కరువు రాళ్లయినయ్

మేం పోరాటాన్ని ప్రేమించి

అందులోనే పొర్లిపొర్లి

పరవశంతో అమరత్వమైన నేల ఇది

ఈ నేల వ్యక్తిత్వ వికాసాన్ని దునుమాడింది

సంఘం శరణం గచ్ఛామి అంది

రా... జయప్రకాశా...రా....

మాలొల్లి నీకు తెలుసు

మా నీళ్లు కన్నీళ్లు
నీళ్ళనుంచి కెలకేసుకొచ్చిన నువ్వు
నా కన్నీళ్లను ఎట్ల కళ్లకద్దుకుంటవ్
మా వాకిళ్లలో కొచ్చి
జై తెలంగాణ అంటావా?
మా వూర్ల దొరలు గీసిపోయిన
మాదిగ గూడాల్ని వూర్లకలుపుతవా?
నా యాసకు నువ్వతుకుతవా?
నానేల దాస్య విమోచన పాటకు కోరసిస్తవా!
ఈ త్యాగాల నేలమీన
వ్యక్తిత్వ వికాస మొక్కల్ని పెరికేస్తవా?
మా ఊళ్లను ఎన్‌కౌంటర్ నెత్తురు
ముద్దలు కాకుండా ఏం జెస్తవు జెప్పు
ఇంకా మా వూళ్లపైన ఏలాడుతున్న
దొరతనాలను కత్తిరిస్తవా?
ఏమిచ్చేటందుకు నువ్వొస్తున్నవ్
ఏం జేసేటందుకు కదులుతున్నవ్
జయప్రకాశా
నాఖాళీ అయిన వూళ్లు నాక్కావాలి
వలసలు లేని జనం నిలకడలుకావాలి
ఎన్‌కౌంటర్ల నెత్తురు లేకుండా పొడిసే
పొద్దులు కావాలి
నాతెలంగాణ నాక్కావాలి?
ఇస్తవా! తెస్తవా!
వద్దంటవా! కాదంటవా!
ఏమంటువు సెప్పుమల్లా

నేను సృజనశీలిని
బతుకు పువ్వు కొత్తగా పూయాలనే సూపును
స్వచ్ఛందాలు రాజకీయాలవుతున్నప్పుడు
అదే దండాకు ఇంకో జెండా
జెండాలు చెట్ల చిగురుల్లా పూయనీయండి
వెయ్యి ఆలోచనల గొంతులు మాత్రం
కోయకండి
నా ఇంటికి నిన్ను పిలిచేటప్పుడు
అనుమానాలస్సలొద్దు
అయినా నువ్వు నేను ఒకటెట్లా అవుతాం
ఒకటయితే
నా గంజితాగి నాపాట పాడు
ఈ ఎర్రసెలకలకు మొక్కి
గీనేల తలపోతలకు రూపమివ్వు
జయప్రకాశ్...రావయ్యా రా
నాకు కులంలేని వూరు కావాలి
మతంలేని దేశంకావాలి
అడ్డుగోడల అంతరాల్ని అడ్డంగా
నరికే మనిషి కావాలి
నా నేల నాకిచ్చే తెలంగాణ గొంతు
కావాలి
వస్తవా! రా!



# తెలంగాణ యుగోదయం

చెప్పకపోవట మేదీ లేదు
తెగదెంపుల సంగ్రామమని తెగేసి, తెగ్గోసి, చెప్పేశాక
చెప్పలేదని
చెప్పక, తప్పక, చెప్పితీరాలని
తండ్లాట ఆడటమేదీ లేదు

కుట్రలని విప్పుకుంటూ
తేలుకొండి రాజకీయాల మొండీలను విరుచుకుంటూ
నాగేటి చాళ్లలో
నల్ల నల్లాటి నా తెలంగాణని నాటుకుంటూ
ఎరుపెక్కిన సూర్యోదయం లాంటి నా తెలంగాణ
పాట పాడుకుంటూ...
అప్పుడే పుట్టిన పసిపాప చిరునవ్వు లాంటి
అమాయక నా తెలంగాణ ముచ్చట చెప్పుకుంటూ
రానున్నది తెలంగాణ యుగోదయం

మా లెక్కలు మాకున్నాయి
మా ఆయుధాలు మాకున్నాయి
మా వ్యూహాలు మాకున్నాయి
మీ అబద్ధపు సమైక్య గీతం నా పాట ఏకాగ్రతను
కదిలించలేదు

ఎవ్వరు ఏ రూపంలో వచ్చినా గెలుపు మాదే!
జొన్న కంకుల
తంగేడు పూల  పరిమళాల
బతుకమ్మ పాట నా తెలంగాణ తల్లిదే!

మీ ఊహలు తెగిపడతాయి
మీ వ్యూహాలు బెడిసికొడతాయి
నాది నిజంమీద నిలబడ్డ నిప్పుల ఉప్పెన
మీది అబద్ధాల, కుట్రల, కుతంత్రాల ఊహల ఊయల
610తో మీరాడిన
ఆరువందల పది నాటకాలు చాలు
610తో మీరాడించిన
అరవై వేల పదహారు కుట్రలు చాలు

దళారుల పశ్చాత్తాపం మాకక్కర్లేదు
విముక్తి గాలికి వేలాడే దేహం విదేహమై
నెత్తురు మండే, శక్తులు నిండే
నేలతల్లి పాటపాడే ప్రాంతీయ దేశభక్తులు కావాలిప్పుడు
పట్టెడన్నం పెట్టిన తల్లికోసం
పానాలను బుడ్డ గోచిని ఇసిరి కొట్టినట్టు ఇసిరి కొట్టే
నేలతల్లి బిడ్డలుకావాలిప్పుడు
ఏదో చేస్తారని
మీ కోసం ఎదురు చూసే కాలం కాలంచేసిందిపుడు
ఇక కాలమే నా కోసం తపిస్తుంది
ఇక కాలమే నా కోసం విముక్తి గీతం జపిస్తుంది
కాలం నా కోసం వడిసల రాయి అవుతుంది
సెకండ్ ఎస్ఆర్సి ని ఉత్తరించే లవిత్రమౌతుంది
కళ్లముంగట కబ్జా చూసినంక

యూ టర్న్ కవిత రాయకపోతే
నేను కవిని కాను
మ్యానిఫేస్టోల మ్యానిప్యులేషన్లు చూసినంక
మట్టి సాక్షిగా తెలంగాణ మట్టి పాట పాడకపోతే
నేను ఉద్యమ గీతానికి అరువిచ్చిన గొంతుకను కాదు

మళ్లీ మళ్లీ చెపుతున్నా
తెలంగాణ అగ్నికి కవిత్వ సమిధనొకటి ఆహుతిస్తాను

అన్ని దారులు మూసుకున్న చోట కూడా
ఒకే ఒక దారి తెరుచుకునే వుంటుంది
ఇబ్సన్ గుర్తున్నాడా ..?
మూడు తలుపులు మూసుకున్నాక
నాలుగో తలపు తెర్చుకుంటుందన్న మాట
గుర్తుందా..?
సెకండ్ ఎస్ఆర్సి ఒక తలుపు
610 ఒక తలుపు
10 కోట్ల ప్రజల ఏకాభిప్రాయం మరో తలుపు
అన్ని తలుపులు మూసుకుపోయినయి

ఇక తెరవక తప్పని తలుపు
రాజకుమారుడు వెళ్లక తప్పని, తెరవక తప్పని
తలుపు
అదిగదిగో... తెలంగాణ యుగోదయం
తలుపు తెరిస్తే ...
ఒక పులకరింత
ఒక కలవరింత
నన్నల్లుకున్న నా మహా తెలంగాణ కౌగిలింత

# నడిగూడెం గిట్లయిందేంది?

దేశానికే ఎర్రజెండా నందించిన చేయి
నా నల్గొండ
ధీర, వీర, త్యాగాల తోవ నా నల్గొండ
పట్టెడన్నం బెట్టిన నేలకోసం
పానాల్ని యిసిరికొట్టిన నల్లగొండలం
మనం మట్టి వాసననలం
పోద్దాడు కల్లులొట్లం
చైతన్య పొదుగులం
వడిసెల రాళ్ళం
కారపు రోకళ్ళం
తాటి ముంజులం
ఈతపళ్ళం
జొన్న బువ్వలం
గోసిగుడ్డల అవ్వలం అయ్యలం
సృజనకు పుగుడుబోసిన గడ్డ నల్గొండ.
చరిత్రకే చరిత్ర, త్యాగాల చరిత్ర
నెత్తుటి చరిత్ర, మానవీయ చరిత్ర
నల్గొండ ప్రపంచ చరిత్ర

ఎట్లాంటి మావూరు ఎట్లయ్యింది
మా నడిగూడెం నవిసినట్లయ్యింది
వూరే కళ తప్పింది, పాలిపోయింది
గడ్డి పోసలతో పచ్చరంగేసినట్లున్న
బడి వాకిలి ఎండింది
ఇంజన్‌బాయి, గరకబాయి లెండినయ్
నీళ్ళులేక వూరు ఎండిన నాలుకాయే
వడ్లబజార్ల మంచినీళ్ళబాయి
ఉప్పుకశమైంది
వూర్నిప్పుడు ఫ్లోరోసిస్ పట్టింది
అది అమ్మోరై ఇంటింటికి ఎగబాకింది
ఈడ్చుకపోయిన డొక్క
ఎముకలు తేలిన వొల్లు
ఒంగిన నడుము
పడిదప్పిన సూపులు
కళతప్పిన మొకం
ఇదేం గత్తరో?
ఇరుగుడెప్పుడో?
వూరు పీక్కబోయింది
రోగాల గూడైంది
చీకిపారేసిన టెంకలాగుంది
కాలి గజ్జెల సప్పుడుతో
నడుస్తుంటే ఎగిసిపడ్తున్న యవ్వన అదరాలతో
నడుము ముడతల మడతల
సొగసులతో మురిపించి
కవ్వించి, కదిలించి, ఊగించి, ఉరికించి



మా మనసుల్ని ఎగరేసుకెళ్లిన
అందాల సొగసుల నజరానా మా నడిగూడెం
ఇప్పుడు వొట్టి సవిటి నేలయింది
పూటలేని బావైంది
ఆకు రాలిన చెట్టైంది
పూత లేని మొక్కైంది
రుసి లేని నాలుకైంది

బళ్ల పంతులు జెపుతుంటే
పిల్లలు పళ్ళు గొరుకుతండ్రు!
నా నీళ్ళు ఎవలు కాజేంసింర్రు?
నీళ్ల నిప్పులు!
పగులుతున్న కన్నీళ్ళు
పగిలిన గుండెలా సెరువు
తరగతి గదినిండా
ప్రశ్నలే ప్రశ్నలు
పిల్లలు ప్రశ్నలు

సెరువలుగు కాడా ఎగిరే
చందమామ చేపల తెల్లగుంపులేవి?
అలుగు పలిగి
రాళ్ళ పంజరమైంది

ఎన్నెనో నీళ్ళ పిట్టలతో
బుడి బుంగలతో
ముక్కెర పాముల్తో
యిసుక దంతుల్తో

తీరొక్క సేపల్తో
పూరి కుతికల దాకా నీళ్ళు
సెరువు ఏమైందో!
ఇది కరువు కనికట్టో
నా నేలకు ఎవడేసిన కాటో

జగ్గయ్యపేట డిపో ఎర్ర బెంజి బస్సు ఇక్కడ్నే
రౌండ్లు కొట్టాలే
సీటునిండా మా సైదులు కూకొని
స్టీరింగు తిప్పుతుంటే సూడాలే
ఆ దువ్వ లేసి ఒంటిని కప్పేస్తుంటే
అదొక దువ్వానుభూతి
అదొక మట్టి పరిమళభాష

గాంధీ పార్కుల రేడియో
సామూహిక వినోదం జానపదం
నాకళలే నా తల్లులు
యాసే మా శ్వాస

శనివారం పావలా సైన్మా
సింగిల్ ప్రొజెక్టర్ సైన్మా
మచ్చయ్యే కట్టించిన సైన్మా హాలు
యిసుకల వెండి తెర ముందు
పిడి గుద్దులు, కత్తుల కొట్లాటలు
పక్కనోడి డొక్కలో గుద్దులు
ఈలలే ఈలలు

పోరగాళ్ల గొలలు
ఇపుడు దాన్ని ప్లాట్లు జేసింద్రు

మా వూరు ఎటుగాకుండైంది
బతుకులు ఎండినాకులైనై
వూరు చంపబడింది
వలస ఏడుపు కట్టలు దెగుతుంటే
పేగు బంధాలను మోస్కుంటు
సంచార జాతినై పట్నంకొచ్చిన
గిప్పుడు
వూళ్లో
వంకర్లు పోయిన వొళ్లు
ముసలోల్లే మిగిలింద్రు

వూరి ముఖం ముడ్తపడ్డది
పళ్ళు గారబట్టినయ్
మోకాళ్ళు కూలబడ్డయ్
చిల్లుపడ్డ కంచమైంది
సెలకల మీద ఒట్టిగాలి
అటక మీద జ్ఞాపకాల మూట
ఇక్కడ –
యవ్వనం అంగవైకల్యం
శైశవం వృద్ధాప్యం
కళ్ళముందే వూరు గూనిదైంది
నీళ్ళకోసం
సొంత నేలకోసం

నెత్తుటిపాట
మన బతుకుబాట
బతకమ్మ పాట

సెగలుగక్కే నా పాటకు
వలసకట్టలు తెగాలి
మన వూళ్ళన్నీ నీళ్ళు కావాలి

పొక్కిలి నా పాట
మత్తడి నా నేల
తెలంగాణ నా యాస
కాళోజీదే అసలు భాష
ఇది ఆత్మగౌరవపు పాట
ఆత్మ రక్షణ బాట



# మా ఆత్మ గౌరవం పోతన

తరలించుకపోటానికిది
పోతిరెడ్డిపాడు కాదు
తెలంగాణ ఆత్మగౌరవ
సాంస్కృతిక చిహ్నం పోతన
రాజాస్థానాల్ని ఎడం కాల్తో
తన్నినోడు మా పోతన
మీ మాన్యాలు, వరహాలు వద్దన్న
పోతన్నే మా ఆత్మగౌరవం
వీధుల్లో భిక్షాటన చేసిన
వ్యాసుడు కాదు మా పోతన
హలం పట్టి భాగవతం చెప్పిన కలమిది
కవిత్వాన్ని అమ్మనన్న ఆత్మగౌరవ జెండాయిది
నిబద్ధతకు నిర్వచన రూపమది
అడవిల తంగేడు పూవు
తెలంగాణ ఎర్రసెలక పోతన
ఈ నేల నుంచి పోతనను ఎవరేరుజేస్తరు
ఈ మట్టి నుంచి 'పోరు'ను
పోతన్నను యిడదీయలేరు
దొడ్డికొమరయ్య, చాకలి ఐలమ్మ, బందగీలు

కాళోజీ, చుక్కా రామయ్య, వరవరరావులంతా
పోతన నేర్పిన ఎదురుతిరగమన్న పాఠాలే
గద్దర్, గోరటి ఆసెట్లు యేర్లే
అందెశ్రీ, అంజయ్య తెలంగాణ మొలకలు
బిరుదరాజు కాడికెళ్తె ఆనవాలిస్తడు
గాజయధీర్ జనపదాల ముచ్చట చెప్తడు
వానమామలై పోతన చరితమిస్తడు
మాకు కుట్రలు తెల్వవు
ఎదురుతిరగటమే తెల్సు
మేం నీళ్ళదొంగలం కాం
రాజ్య చోరులం కాం
ఆక్రమణదారుల మసలేకాం
మేం పచ్చిగా పోతన్నలం
పచ్చిపాల నురుగులం

*(పోతన కడప జిల్లా ఒంటిమిట్టకు చెందిన వాడు కాదని హైదరాబాద్ ట్యాంకుబండపై పోతన విగ్రహం వద్ద తెలంగాణ రచయితల వేదిక ఆధ్వర్యంలో కవులు, రచయితలు, సాహితీవేత్తలు, విద్యావంతుల నిరసన సందర్భంగా ఈ కవిత)*



# కాకా ఇది ఆఖరి మోక

మోసానికి గురైన వాడు
ఒక్కసారి ఎదురుతిరిగితే
మోసానికి సెమటలే ఇక
కావాలని చేసే తప్పులకు
నువ్వు ఎంతటి శిక్షకైనా అర్హుడవే.
ఎందర్ని మోసగిస్తరు
ఎన్ని సార్లు మోసగిస్తరు
సెకండ్ ఎస్సార్సీ ఓ కుట్ర
$3^1/_2$ కోట్ల మందిని ఏ అబద్ధంతో
దాటి పోతరు
పెద్ద మనుషుల ఒప్పందాలనేంజేస్తిరి
మీ సకల పాదయాత్రలకూ
దారిచ్చిన ఎర్రసెలకల వూసుల్ని
నీ ఎస్సార్సీతో మభ్యపెట్టలేరు
అబద్ధాలతో నిర్మించేది నిలవదు
కుట్రలతో ఎల్లకాలం పాలించలేరు
మీరు నీళ్ల దొంగలని తేలింది
నా నేలను కమ్ముకుంటున్న సీకటని తేలింది
అభివృద్ధి తడిగుడ్డతో
తెలంగాణ గొంతు కొస్తున్నారని ఖరారైంది

యాక్ ధూ
సెకండ్ ఎస్సార్సీ ఒక పచ్చి మోసం
ఈ దండు నెవ్వరూ కదలిస్తరు
ఈ నినాదం ముందెవరు నిలుస్తరు
తెలంగాణ యిడిసి జనం రారు
తెలంగాణ మా వేదం
తెలంగాణ మా నాదం
తెలంగాణ మా వూపిరి
మళ్ళొక్కసారి చవిచూడక
తప్పదు మా సాహసం
సెకండ్ ఎస్సార్సీపైన
మా అవ్వలు దుమ్ముపోస్తున్నరు
మేము సలసల కాగుతున్న కత్రులం
ఎర్రబడుతున్న పిడికిళ్ళలం
మాకు సావులు కొత్తకాదు
తెలంగాణ కోసం
మా పానాల్ని బుడ్డగోసుల్లా ఇడుస్తం
ఇక పొడవబోయే పొద్దు
తెలంగాణ కోసమే
ఇక నిలవబోయేది
మా ఆత్మగౌరవం
గెలవబోయేది మా అస్తిత్వ పోరాటం
కాకా ఇది ఆఖరిమోక
వైఎస్ ఇది నీకే



# పల్లె గోరింటాకు

పచ్చిగా వాడొక జీర గొంతు
జీవితం సాక్షిగా బతుకుకు మొదలు వాడు
ఆశ నిరాశల మధ్య వారధి
ఒక్క మాటలో వాడు
జీవం పోస్తున్న తల్లి రొమ్ము
వాడ్ని పదాలతో పేనలేను
అక్షరాలతో అతికించలేను
రెండు కాళ్ల మధ్య
బతుకు మర్మాంగం వాడు
ప్రాణానికి యాసను శ్వాస చేసినోడు
పాట కోసం తనుకులాడుతున్న పక్షి
తనను తాను నిర్దాక్షిణ్యంగా నరికేసుకొని
వాగ్గేయకారుడై పుట్టినోడు

వాడి చూపు,
వాడి మాట,
వాని పిచ్చి అమాయకత్వం
వాని దుంకుడు,
మొత్తంగా స్వరాన్ని వాడు

అడ్డంగా, నిలువుగా నరికేసుకొని
ప్రతి వాకిలి ముందు
పాటగా పూసినోడు
కవిత్వమై కాసినోడు
గోరటి వెంకడు
పాటకు సిరునామా కాదు
తరతరాల సాంస్కృతిక గుర్తు
వాడి కంటి చుక్క
ఒక్కొక్క ప్రమాద హెచ్చరిక
వాని పసికంకుల పాల నవ్వు ముందు
పిండి వెన్నెల తలదించుకోవాలె
వాని మనస్సు యిప్పి జూస్తే
గుప్పుమనే మట్టి వాసన
వాడ్ని యాడవదిలినా
జర్రునా మూలాల్లోకి పోతాడు
మనందరం ఎక్కడ బతుకుతమో
అక్కడ వాడు తేల్తడు

అరే-ఎంకన్నా ఎందుకురా?
జ్ఞానం కళ్లు తెరిపించేందుకు
నీ రెండు కళ్లు పొడిచేసుకున్నవ్
నీ నాలుకే సరస్వతి
నీ పాదాలు నటరాజు పగిలిన కాలి గజ్జెలు
నీ పాటతో ప్రపంచాన్ని
పావురం చేసి ఎగురేసుక పోయినోడివి
రోజు పుట్టడానికి ఎన్ని సార్లు కన్నుమూస్తడో

నీ గుక్క
పాలందని బిడ్డల నోళ్ళకు
కవిత్వం పాలు పట్టినట్లుంటది
ఈ దుఃఖానికి మూలం వెతకటానికి
ఎవ్వడైనా సరే
నీ పాట పాదంకాడ తలపెట్టాల్సిందే
వెంకన్నా -
నువ్వు నాగరికతకు నారుమడివి
తెలంగాణ పలుకుబడివి
వాడు ఎటుతిరిగితే అటు
కవిత్వం జల జల
వాడు ఏ కొమ్మ పట్టుకున్నా
అది అలంకారాల తోటైతది
ఏ రెమ్మను తాకినా
సమాసాల సొగసైతది
తెలుగు కవిత్వానికి
గోరింటాకు గోరటెంకన్న
వాడు మట్టికి మాటలు నేర్పిన
వాగ్గేయకారుడు
వాడు సృజనకు పురుడు
చైతన్యానికి చిగురు



# తల్లి బిడ్డ కోసం ఎదురు చూస్తున్నట్లు.....!

దువ్వకుంటే రాలిన ఎంట్రుకల్లా
వదిలేసిన చెప్పుల్లా
పదవుల్ని గాలిబుడగల్లా వూదేసి
తన నేల పాట పాడటమే పరవశం
మంది కోసం ఎప్పుడైనా
శిలువెక్కే క్రీస్తులు కావాలి
రాజ్యాన్ని వదిలిపెట్టే బుద్ధుల కోసం
కాలం ఎదురుచూస్తోందిరా
ఇది కలపడే సమయమని
కలిసి నిలబడే కాలమని
పదవులకు రాం రాం చెప్పి
తల్లి తెలంగాణ పాట పాడి
మూడున్నర కోట్ల మంది
మనసుల్ని కొల్లగొట్టింద్రు కదరా!!
తెలంగాణ సెలకల్ల మొలకలైతిరి
మా వాకిళ్ళ ముందు ముగ్గులైతిరి
తడారుతున్న నోటికి గుక్కెడు నీళ్లైతిరి
ఇది ద్రోహకాలాలను తెంచివేసే
కదన కాలిక నాళిక

తెలంగాణ గోసిగుడ్డల
అవ్వలు, అయ్యలకోసం
రాజీనామ చేసిన బిడ్డల్ని చూసి
పార్లమెంటు, అసెంబ్లీలు
సిగ్గుతో తలదించుకున్నయ్
చట్టసభలు ఎవని చుట్టపుసభలో
తెలిసిందిగా?
తెలంగాణకు దోహదకారు లెవరో
ద్రోహకారులెవరో తేలింది.
మందికోసం పుట్టి, వాళ్ళ కోసమే బతికి
వాళ్ళెంటే ఉండి కన్నుమూయటమే
ఈ మట్టి మనకు నేర్పింది
రండి
అరాఫత్‌లా అరుద్దాం
ఆధిపత్యంపై దుమ్మెత్తి పోసిన
ట్రేసి చాప్‌మన్‌లా గొంతులిప్పుదాం
కెసిఆర్ .. రావయ్యా రా!
తల్లి బిడ్డకోసం తనుకులాడినట్లు
ఈ నేల ఎదురుచూపులు చూస్తోంది
తెలంగాణ ప్రత్యేక రాష్ట్రమే
మూడున్నర కోట్ల ప్రాణ నినాదం
కెసిఆర్ -
రాజీనామాలై పోయినయ్
ఇక రణమే మిగిలిందిక

# అక్షరం ఒక జీవనాడి

మాట్లాడినవన్నీ మాటలు కావు
అచ్చరాలన్నీ అమర కావ్యాలు కావు
రాసిందంతా కవిత్వం కాదు

రక్తమాంసాలున్న మాటలే మాటలు
దుఃఖ సముద్రాలు పోటెత్తే అచ్చరాలే అమరకావ్యాలు
బాధల్ని తాకించే కవిత్వం
బాధల గాథలకు గుడి కట్టిందే చిత్ర సందోహం

ప్రపంచీకరణ వరద వెల్లువై పొంగుకొచ్చినపుడు
కవిత్వమేగా మనల్ని ఆదుకుంది
మొగుడు, పెళ్ళాము, పిల్లలు
అపార్టుమెంటూ, చిరిగిన ప్యాకెట్ మనీ
చితకని బతుకుల కథల చితుకులు
వీటన్నింటి మధ్యా...
రెండు నిండు పదాల మధ్య
కానరాని జాగాలా మారానో గదా...!

నిలువెత్తుగా నన్ను నేనే ఎంత చూసుకున్నా
మనసు గాలానికి చిక్కు కోవాలన్న ఆరాటం నిలువనీదు కదా!
ప్రతి రోజూ సలికాసుకునేందుకు

ఏసుకునే చలిమంటలాంటి కయిత్వం ముందు
అన్నీ మర్చిపోతున్నాను
నేనూ... నన్నూ...?

నేనిప్పుడు
http.money.com ఫైల్లో
పాస్‌వర్డ్ లేకుండా నాలోకి నేను పోలేను
పదుగురు కలిసి పాడుకునే 'జానపదానికి'
User ID లేక
Pop సంగీతానికి పైకెగిరి పోయింది
జీవితం కంప్యూటర్లలోకి
ఈ ప్రపంచీకరణ "బగ్"ని నింపింది
వరల్డ్ బ్యాంక్ కావచ్చు...
అమెరికా దొరవారూ కావచ్చు...
నా మీద ఏ ముళ్ల ప్రపంచీకరణ
కిరీటమైనా పెట్టండి
పరాయి వారి కోసం శిలువనెక్కే ఓపిక లేదు.
Think Globally
Act Locally
అన్న వాక్యానికి ఎటు చూసినా నేనే...!

నా అక్షరాలు కొత్త కొలుములు
మానవ సంబంధాలను వెలిగించే చమురు మంటలు
అందుకే నేను
నా అక్షరాలతో సమాజానికి దూగోడ పడుతున్నా
అంటుపడిన పదాలతోటలో పూలు ఏరుకొని

"బుద్ధం శరణం గచ్ఛామి" అంటూ
సమాజానికి కొత్త పాఠం చూపుతున్నా!
క్రెడిట్ కార్డుల్లోకి జీవితాన్ని పంపించాక
కాంచన మృగం లాంటి 'కులం' నన్నేం చేయగలదు
నా చుట్టూ నన్నే ఫెన్సింగ్ చేస్తూ
గ్రేటరాబాద్ చేస్తున్న కుట్రల్ని
పగలగొట్టిన వాడిని.
విశ్వీకరణ నన్నేం చెయ్యగలదు
అది పిల్లవాడి పసిచేష్ట.

ఇట్లాంటి ఎన్ని కరణీకాల్నీ తరమలేదు!
మళ్ళీ మళ్ళీ చెపుతున్నా...
విరిగిన నా ఎన్ను మీద
ఎన్ని గ్లోబల్ కాలనీలయినా కట్టండి.

నా కళ్ళ వాకిళ్ళ ముందు
కలల రంగవల్లికలద్దేందుకు
ఏ ఎస్సార్సీల ద్వారాలక్కరలేదు.
ఎవరేం చెప్పినా నమ్మకండి
మాట్లాడేవన్నీ మాటలు కాదు
అచ్చరాలన్నీ అమర కావ్యాలు కావు
రాసిందంతా కవిత్వం కానేకాదు
గీసిందంతా సజీవచిత్ర సందోహం కాదు.
జీవితాన్ని కాచివడగట్టిందే కవిత్వం.



# సాంకేతిక కలనేతల పైటకొంగు

నైవేలీ నీ పేరు వినగానే
యూరియా ఎరువులే గుర్తు
రైతుకు రొక్కం చేనుకు లాభం అన్న
ఆకర్షణీయమైన నినాదాలే విన్నాను
కానీ

నేల పొరల్ని ఇప్పిచూపిన
చేతుల్ని చూసి
నా కాళ్లు మూర్ఛిల్లాయి

చేతులు, పాదాలు
రెండు పనులకే అనుకుంటే
బహిరంగ పాతాళమోక్షం కనపడదిక్కడ

చేతికి పొడిగింపే యంత్రం
ఇది వెలుగుల్ని పూయించే మట్టి తంత్రం
నైవేలి ఒక సాంకేతిక కలనేతల పైట కొంగు
నేలలో దాగిన అరల్ని చూపిన అందాల పొంగు
నైవేలీ వెలుగుల సంజీవని

చుట్టూ పచ్చదనం చూస్తుంటే
నా ఆదిలాబాదే గుర్తొచ్చే
ఎనకబాటుతనం చూస్తే
కడతారు, నల్గొండా ఒకటే
నైవేలిని చూస్తుంటే సింగరేణి విప్లవాగ్ని
కణం యాదిల మెదుల్తది
నా సికాస పోరాటలు పొర్లుతాయ్

ఎక్కడ తీసినా బొగ్గుబొగ్గే
యాడ చూసినా మనిషి మనిషే
సింగరేణీ, నైవేలీ
నాకిప్పుడు తేడా కనిపించట్లే
నైవేలీ నువ్వు ఎవరుకన్న కలవే?
ఇంత కాంతులు పండిస్తున్నవ్
ఈ కాంతులు యాడ కాయాలి
నువ్వు ఎవర్ని వరించాలి

నైవేలీ, సింగరేణిలు
తనను తాను చీల్చుకొని
కాంతుల కంచాన్ని ఇచ్చినయ్

నిజంగా నైవేలీ నిన్ను చూస్తుంటే
వదలబుద్ధి కావట్లే -
సాంకేతిక జ్ఞానం పండని నేలంతా కరువే
జ్ఞాన సంద్రమే ఈ ప్రపంచకం

తెలుగోడి చేతులే
నైవేలీకి రెండు కళ్లు
అవి మండే విద్యుత్ కొలములు

నైవేలీని కలగన్న వార్ని తల్చుకుంటూ
మా బాసర రామయ్య కలను
ఎవరు చెరిపేస్తున్నారో ఆనవాలు పట్టున్నా

నా సాంకేతిక సదువుల సంచిని
ఎవరు లాక్కున్నా ఒప్పుకోను
నేను సాంకేతిక విప్లవాన్ని
జరగబోయే సంగ్రామాలకు సాక్షిని

# పోరాటానికి ఒక OUT SOURCE కావాలి

రోజంతా విచ్చలవిడిగా
తిరుగుతున్నప్పుడు
ఇండికేటర్ పెట్రోలు అయిపోయిందని చెప్పగానే
ఏదో కోల్పోయిన భయం
జీవిత వాహనానికి
కాలమే పెట్రోలు

ఏ దీపాన్ని ఆర్పకుండానే,
నా దీపం ఆరిపోకుండా చూసుకోవాలి
జీవితం ఒక జ్వలన సంగీతం

అన్నీ జయించానని
అంతా నా గుప్పెట్లోనే వుందనుకునే వెర్రి ఆలోచనలకి
దీపానికి నూనె లేని వొత్తినని తెలిశాక
వెలవెలా పోయాయి

అజ్ఞానానికి అర్థం గుర్తించాను కనుక
నేను యిప్పుడు మనిషిని
వెలగటానికి సహకరించిన చేతులని

నిలబడటానికి కారణమయిన పాదాలని
గుర్తు పెట్టుకున్నాను కనుక
యిక నేనెప్పటికీ ఋషినే!

ఒక్క అహంకారాన్ని వదిలితే
ప్రపంచం ఎంత హాయిగా గాలిపీల్చుకుంటుందో...
ఒక్క "నేను" సమిధనయితే
ఒక్క "నేను" కనుమరుగయితే
వెలుగొస్తుందంటే సమిధనవుతా...
సమిధనయి కనుమరుగవుతా....

పశువులో ఉన్నది ప్రాణమే ..
గడ్డిలో వున్నదీ ప్రాణమే...
దేనికైనా తేడా లెందుకు?
మనమంతా నెత్తురు ముద్దలమే
మనమంతా ప్రాణానికి రంగులేసుకున్న వాళ్లమే

ఎందుకో
ఒకడు 'సద్దాం' అవుతాడు
ఒకడు 'బుష్' అవుతాడు.
పాలు కారే పెదాలను తల్లి స్తన్యానికి దూరం
చేసిందెవరు?
మనిషి 'సద్దాం' కావడానికి
మనిషి 'బుష్' కావడానికి
మధ్య వున్న కార్యకారణ సంబంధాన్ని ఏమందాం?
కమ్యూనిస్టు భాషలో

సామ్రాజ్య వాద మందామా?
నయా వలస వాద మందామా?
అగ్రరాజ్య దురహంకార మందామా?

వ్యవహారిక భాషలో
చిన్న చేపను పెద్ద చేప మింగటమందామా?
న్యాయమందామా! అన్యాయమందామా?
ప్రపంచీకరణ అందామా!
ఏమి అందాం!
ఏమేమి అందాం?
ఇంకేమి అందాం?
కాలమెంత మారినా
కడుపులో 'పిండం' మారదు.
ఆధిపత్యాన్ని కౌగలించుకుందామా??
నెత్తురు పోసి కన్న నేల కలలో కలుద్దామా?



ఇప్పుడు మన యింటి గోడని కూలగొట్టడానికి
ఒక 'out sourcing' కావాలి.
జార్జి డబ్ల్యూ బుష్ కి నిరసన చెప్పడానికి
మావోయిస్టుల సపోర్టు కావాలి

బెర్లిన్ గోడ
తియాన్‌మెన్ స్క్వేర్
గ్లాస్ నోస్త్... పెరిస్త్రోయికా
అలీనోద్యమం...
గ్రేట్ వాల్ ఆఫ్ చైనా...

ఇవ్వేవీ 'Statue of Liberty' ని కూల్చలేవు
మన చేతులని మనమే పట్టుకుని నిలబడాలి
బతకటం కోసం మనం చావడం నేర్చుకోవాలి.
ఇంకో ప్రపంచయుద్ధాన్ని ఆపే
ఆనకట్టలు మన చేతులే కావాలి.



ఒక్కసారి గట్టిగా
గుండె నిండా గాలి పీల్చి
గర్వంగా చెప్పండి
జై యిండియా
జై జై ఇండియా.



# కంటి సూపు

మా నాయిన రాగమైతే
నా సెవి దగ్గర కావ్యాలు
కళ్లు తెరిసి నిలబడేవి

బతుకు పారం సెప్పిన గురువు
సంస్కార సంపదా ఆయనే

నేనడిగితే సాలు
ఆయన సేత్తో ప్రపంచాన్ని దూసిచ్చేవాడు
నేను సెప్పితే సాలు
కేరిగాణ్ని కోసి బువ్వకంచమయ్యేవాడు

మా నాయిన స్వరమే ఊరికి గానం

వేదాద్రికాడ కృష్ణను
సాలిరువాలు దున్నినట్లు ఈది
నన్ను సేప పిల్లను సేసి
బతుకు నదిలో ఈత నేర్పాడు

నడిగూడెం బళ్లో
అటెండెన్స్‌లో అపశృతి పలికినప్పుడు
నా సెంప సెళ్లుమన్నదప్పుడే

నాటకరంగ వేదిక మీద
ఆయన పాత్రలు
ఆముక్తమాల్యదను ముచ్చట్లుగా సెప్పటమే
నాలోని కవికి వూపిర్లు

నేను నేలమీద పడ్డప్పుడు
ఇంటి వాసాన్ని ఎగిరి సేత్తో పట్టుకున్న ఆనందమాయన

నాయనే నాకు అమ్మ
గాబుకాడ వొళ్లు రుద్ది
తల దువ్వింది ఆయనే
అమ్మ సేను కాడ్నించి
గడ్డిమోపై ఇంటికొస్తే
బడ్నించి వచ్చిన నాయిన
పొయి రాజేసేవాడు

నేను ఏ ప్రాంతంతో
కరచాలనం చేస్తున్నా
అదంతా నాయిన సలవే

అమ్మ ఉగ్గుపాలు
నాయిన బతుకుపారంతో
సదువెందుకో?
బతుకెందుకో??
ఎరకపట్టగలిగిన

నాయనంటే
ఎప్పటికీ పూరించలేని
మహాకావ్యం
దండలో కనిపించని దారం నాయిన

సిన్నప్పుడు నాయిన
ఆలపించిన ఆలాపనలే
తెలుగు సాహిత్యం

నన్ను
ఉద్యమకారుణ్ని
సాహిత్య కాపలాదారుణ్ని సేసిన
కంటిసూపు మా నాయిన



# నిషేధాన్ని ముద్దుబెట్టుకుంటా

నిషేధం మొలిచింది
స్వేచ్ఛ ఊపిరిపోయింది

అణిచివేతకు సలాంచేసేది రాజ్యం
దానిపై ఎగబడేవాడు కవి

నేను నిషేధాన్నే ముద్దుబెట్టుకుంటా
నిషేధించబడ్డ అక్షరాల పెదాల్నే రమిస్తాను

లచ్చుమమ్మల మట్టి పాదాలదాకా
మనరాతలు పోలేదంటే
అవి పచ్చిగా పనికి మాలినవే

అక్షరాలకు ఒకసారైన
నిషేధం ఎదురుపడలేదంటే
అవి జీవం లేని పాదాలే

విరసం నిషేధించబడి బతికింది
నిషేధించిన రాజ్యం చచ్చిపోయింది
ప్రాణవాయువుల్లా వరవరకళ్యాణరావులు

# అమెరికాకు తుది డే

నేడే
నీ డే

మా డే
మేడే

వాడే
మన శత్రువు

ఏదీ తొలి మేడే
ఏదీ తుది వాడే
ఏదీ వాడి తుదిడే

ప్రపంచ బ్యాంకు బానిసలారా ఏకంకండి
పోరాడితే పోయేది ఏమీ లేదు
బ్యాంకు సంకెళ్లు    బానిస సంకెళ్లు తప్ప

యాడ జూసినా యిరగకాసిన
చెమట చేతుల్నెవరో తుంచేస్తున్నారు

అసలు కార్మికులెక్కడున్నరు
అంతా బానిసలే బ్యాంకుకు బానిసలే
దేవుడి పాలనలో
వామనుడి మూడో పాదం
ప్రపంచబ్యాంకు అవతారమెత్తుతుంది
పాలకుల సార్వభౌమత్వాన్ని ఎప్పుడో
ఎగరేసుకుపోయింది బ్యాంకు
ఇపుడు రెండే
ఒకటి బానిసగా ఉండటమా    ఉరితాడుకు వేలాడటమా

ప్రపంచ బ్యాంకు ముందు
మన పాలకులు నగ్నంగా, నిసిగ్గుగా
చేతులు జోడించి వినమ్రంగా, సాష్టాంగంగా
ప్రధాని ప్రధాన బాంచ
ముఖ్యమంత్రి ఒక బానిస
దేశాలు బానిసక్షేత్రాలు

వాలెంటెన్స్ డే
మదర్స్ డే, ఫాదర్స్ డే
ఫ్రెండ్స్‌షిప్ డే ల మధ్య
నా మేడే ఎప్పుడో ఎగిరిపోయింది

థర్టీ మినిట్స్, పార్టీ మినిట్స్
ట్వంటీ మినిట్స్
అసలు ఈ రోజు ప్రోగ్రాముందో లేదో
చెమట కాలానికి వేలాడే సరుకా?

వ్యాపార ప్రకటనల మధ్య
పదహారేళ్ళ సొగసుల పొత్తి కడుపుల మధ్య
సౌందర్య పోషకాల మేకప్ ముఖాల మధ్య
చెమటెక్కడ కనపడ్తది
శ్రమ సౌందర్యమెవరికెరుక?
థమ్స్అప్ మీ మగతనానికి గుర్తు

పనిచేసే చేతులకు పుర్రెగుర్తులు
దేశమే ఒక గ్లోబల్ సంత
ప్రపంచమే ఒ ప్రపంచీకరణ ఆధిపత్య గ్రామం

పదిహేనేళ్ళ క్రితం
మా కోదాడలో మేడే నాడు
డ్రైవర్ సైదులు మెడలో వేసుకున్న
ఎర్ర కండువా ఈ ప్రపంచ బ్యాంకు గాలికి
ఎటుఎగిరిపోయిందో?
ఇక డ్రైవర్లెక్కడా
అంతా కాంట్రాక్ట్ స్టీరింగ్ తిప్పే కట్టు భానిసలే

భానిసలు కార్మికులు అయ్యేందుకు
కార్మికులు ఎర్ర సమాజమయ్యేందుకు
పెనుగులాట ఒక్కటే మన పొద్దుపొడుపు
ప్రపంచ పటాన్ని వాడ్పించి తీసేసేందుకు
తండ్లాట నిత్య తండ్లాట

నేను మట్టి కావటం
ఆ మట్టి నుంచి తిరిగి మొలకెత్తటం
నాకు కొత్త కాదు  అది నా బతుకు సూత్రం

సింగరేణి కాడా మంట రాజేస్తున్న
అజాంజాహి మిల్లు కాడ ఏకమౌతున్నా
నా చెక్కర ఫాక్టరీల దెగ్గర చికాగోల్ని చెక్కుతున్న

బానిసలందర్ని ఏకం చేసే పనిలో వున్న
నన్ను కదిలించకండి
నాతో స్వరం కలపండి
ప్రపంచ బ్యాంకు బానిసలారా ఏకంకండి
పోరాడితే పోయేదేమి లేదు
బ్యాంకు సంకెళ్ళు తప్ప
బానిస సంకెళ్ళు తప్ప
కొత్త శ్రామిక చెమట గీతాన్ని అల్లుతున్న
ఈ ప్రపంచీరణను చీల్చే పాటకడ్తున్నా

ఇక
ఎగబడదాం
తెగబడదాం
తెగించి పోరాడుదాం
బ్యాంకు సంకెళ్ళని తెంచుదాం
రండి – లడాయి చేద్దాం
దండు కడదాం
అదే మన మేడే
అప్పుడే మన మేడే
అదే ఆదిపత్య అమెరికాకు తుదిదే

# ఊరుకు ఎన్నికల కట్ల పాము కాటు

ఎట్లున్న ఊరు ఎట్లాయే
ఇన్నాళ్లుగా ఒంటిమీద
పుండ్లలాగా పూసిన వాగ్దానాలు
బంతిపువ్వులాగా
చింత చిగురులాగా
మల్లెమొగ్గలలాగా
పచ్చటి ఊరు వాడి పోయే
ఈడుబోయిన సెలకయ్యింది ఊరు
తల నరకబడిన మొండెలాగుంది ఊరు
చెట్లపై నుంచి గుంపులాగా ఎగిరిపోయిన పక్షులు
ఊరి ఉట్టి మీద నక్కిన దొంగలు
మా నడిగూడెం బాయిల నీళ్లు ఉప్పుకశమెందుకైనయో
దొరగడీ చుట్టూ బూజులాగా అయ్యింది వూరు
సెరువు ఎండి
భూముల గుండె పగిలి
వలసదారి పట్టి పోతుంటే
బుక్కెడు బువ్వ లేనిదయ్యింది వూరు
దిక్కులేని పక్షయ్యింది నా నేల
ఉసిగొలిపిన వడిసెల రాయిలాగా
చేతిలో గొరుకొయ్యలాగా

ఊరిపైకి బ్యాలెట్ బాకు
పొత్తులతో జెండాలు
రంకులతో రాజకీయాలు
ఊరికి ఎన్నికల తలకొరివి
పగిలిన బ్యాలెట్ కపాలమోక్షంతో
ప్రజాస్వామ్యం...
పలకరింపుల స్వరంతో
కల్లాకపటంలేని మాటలతో
పసిబిడ్డ బోసినవ్వులాగా
యవ్వన సౌష్ఠవంపై జారుతున్న పైటలాగా
అప్పుడే దించిన పయిటాల కల్లులా వుండే
నా వూరేంది
ఇపుడు
సొమ్మసిల్లి తూలుతోంది
నా వూరికిఎవడు ఏ మత్తునెక్కించారో.. ఏమో..
బతుకును బ్యాలెట్ మారుస్తదా?
పచ్చగా నవ్వే నా వూరిప్పుడు
జెండాలను మోయలేక సచ్చుబడ్డది
పల్లెనెత్తిమీద జల్లిన వాగ్దానాల్లో
ఒక్కటన్నా మొలిసింది లేదు.
నా పల్లె వాగ్దానాల హత్యలకు గురైంది
నా పల్లె నెత్తిమీద జల్లిన వాగ్దానాల్లో
ఒక్కటన్నా మొలిసిందిలేదు
ఆ పల్లె వాగ్దానాల హత్యలకు గురైంది
నా పల్లె అబద్ధాలను విని విని చెవిటిదైంది
జెండాలు చేస్తున్న మోసాలకు మూర్ఛిల్లింది

ఊరుకు ఎన్నికల గత్తరొచ్చింది
కాళ్లూచేతులు వంకర్లు తిరిగిన నా వూర్ని
రాజకీయకట్లపాము కాటేసింది
ఊరు నగరం ముందు
ఖాళీ ఇస్తరాకైంది
అసమానతల నిచ్చెనలో
మా వూరిది చివరిమెట్టు
బలంగా వున్న నావూరు
ఎందుకు సత్తు బిళ్లయ్యిందో
వూర్ని చెల్లని నాణెం చేసి
ఇంకెన్ని సార్లు ఈ తల్లి రొమ్ముగుద్దుతారు
పాలుకారే చెక్కిళ్ల వూరును
నెత్తుటి ముద్ద చేస్తిరి
వూరు శపిస్తోంది
వూరు ప్రకోపిస్తోంది
ఈ ఎన్నికల నెత్తిమీద
మన్నుబోస్తుంది
ఇది ప్రజాస్వామ్య పల్లకా!
నా వూరుకి వల్లకాడా!



# కవిత్వానికి రెండువైపులా సెమట సుక్కలు

సముద్రాన్నయినా
సూర్యోదయాన్నైనా
చేతుల్లోకి తీసుకున్నది నేను

ఈ మట్టి వాకిట
చెక్కిలి పైన గుంటలు పడ్డ
అవని అందం నేను

పరివర్తనకు చలనం నావాళ్లు
చీకటి వీపు జరిసినోళ్లం
వెలుగుకు సూపునిచ్చినోళ్లం

సమాజానికి బట్టకుట్టిన వాణ్ణి
మీరు వికృతం కాకుండా చూసిన క్షురకుణ్ణి
మా కుంపటేగా ఈ నాగరికత
సకల సంపదల సమస్త దేహం మేం

నా మీద నేనే చెమటను సల్లుకొని
పంటనై పండి నాకు నేనుగా రాలిన
వెలేసిన అంటరాని కులాల
పగులుతున్న చెమట గోడలు కొత్త కట్టడాలకే

వీపు కడ్డంగా ముల్లు గర్రను పెట్టి
బాలక్రీస్తుల్లా పశువుల్ని కాసే
ఎట్టి పోరళ్లు కదా సెమటలంటే?

సకల అణిచివేత కులాల
ఏకకంఠగానం నా పాట
నా వూరు ముఖ ద్వారం కాడ్నే మార్క్సుకు
అంబేద్కర్, పూలేలను కలిపితే
మనువు మరుగున పడేవాడు
కారంచేడు, చుండూరు, చలకుర్తిలదాకా
యాడ జూసినా చీకాగోలే
కులాన్ని నరికేయకుండా
ఏ వర్గపోరు పూయదిక్కడ
మతాన్ని మంట గలిపి సూడు
ఎట్టోడికి రాజ్యమొస్తది నేడు

సమస్త వృత్తులకు దండం బెట్టి
సమస్త చిహ్నాలతో మనువుల్ని వధించకుంటే
రక్తం చిగురించదిక్కడ
రాజ్యాధికారం కోసం
మన సొంత కాళ్లే అడుగులేయాలి
మన పిడికిళ్లే ఎగరేయాలి
అణిగిమణిగినోళ్లంతా ఏకం కావాలి
శూద్రులు, మాల, మాదిగ వాడలు
కలగలిసి కరచాలనం చేసుకోవాలి
ఆధునిక మనువులపై ఒక కన్నేసుంచాలి

తెగబడటానికి తర్ఫీదునౌతున్న
ఆధిపత్యంపై కలబడే ఆయుధమౌతున్న
మనం ఓడి ఓడి గెలుద్దాం
గెలిసి గెలిసి కలుద్దాం
ఐక్యంగా నిలబడి కలబడదాం

అణగదొక్క బడిన ప్రాంతంగా
అణిచివేయ బడ్డ కులంగా
మనల్ని మనం ఎగరేసుకుందాం
తల్లి వేర్లతో మాట్లాడుకుందాం
ఆధిపత్యంపై తండ్లాటే
మనకు ఎవడో ఇచ్చేదేంది?
మనది మనమే తీసుకుందాం
మనకాళ్లతో నడుచుకుంటూ
పద పద అసెంబ్లీలకు,
పోదాంపద పార్లమెంటుకు
మనకాళ్లతో నడుద్దాం పద
మన చేతుల్తో తెచ్చుకునేదే మన రాజ్యం
రాజధండం చెప్పులు కుట్టే చేతికి
వడ్ల బాడిసకు, చాకలి బండకు,
కుమ్మరి కుండకు, మంగలి కత్తికి రావాలి
రాజ్యం అణగారినోళ్లది కావటమే
ప్రజాస్వామ్యం.....
ఎట్లోళ్ల చేత, అంటరానోళ్ల కొరకు
వెనుకబడిన వాళ్లతో ఏర్పడేదే ప్రజా రాజ్యం
అంటరాని అచ్చరాలకు రెండువైపులా
సెమట సుక్కలుంటేనే కవిత్వం

# ముదిగొండ

నిండు జీవితాల్ని
మింగేదే రాజ్యమైతే
ఇది రాజ్యమే

హక్కుల్ని అడిగితే
ప్రాణాల్ని తీసేదే పాలనైతే
ఇది తప్పక దేవుని పాలనే

ఏమైంది? ఏదెక్కడ మారింది?
కాలం మారి పోలీసు చేతిలో
ఏకే 47, ఎస్ఎల్ఆర్ తుపాకైంది
నేలకోసం నెత్తుటి నదులు పొంగాల్సిందేనా?

అడిగితే తూటాలు
కదిలితే లాఠీలు
నినదిస్తే నెత్తురు
ఇది పచ్చిగా ప్రజాస్వామ్యమే

ఆరడుగుల ఇళ్ళ జాగా అడిగితే
ఆరడుగుల గోతినిచ్చేదే రక్షణైతే
ఇది ముమ్మాటికీ దేవుని పాలనే

ఈ నేల ఎర్రగా పండి
వీరుల్ని అందించి
నియంతల్ని సూపెద్దది

రాక్షసం రాజముద్రయ్యాక
పొద్దుతోపాటు పెనుగులాట పురుడు
పిట్టల్లా రాల్తూ కూడా
ముదిగొండను చైతన్య జండాగా
ఎగరెయ్యటమే పోరంటే
ప్రజలకు అండగా నిలబడ్డాకే
ముత్యాలకొండ మండే కొండయ్యింది

అందరికీ ఇళ్ళడిగితే
అందిరికీ సంకెళ్ళు!!
భూమి దున్నేవాడిదెప్పుడైతది?
ఈ ఎట్టోళ్ళ నెత్తురు
ఇంకెంతకాలం ఎదజల్లాలి
మా నెత్తురుతో పండని
ఉద్యమం యాడుంది
మారంది మా బతుకులే
ఈ రాజ్యాన్ని సగర్వంగా
గల్లా పట్టుకుని అడుగుతున్నా
కవిగా ఎదురు తిరిగి
గొంతు పెకలిస్తున్నా
రాజ్యం ముఖంమీద నిరసన గీతం
యిసిరి కొడుతున్నా

నా తెలంగాణ మాగాణంలో
ఆషాఢమాసంలో
ఆడపడుచులు గోరెంటాకు పెట్టుకోటం ఆనవాయితీ
ఈ రోజు ముదిగొండలో
నా తెలంగాణ తల్లులంతా
నెత్తుటి గోరంటాకులయ్యారు

మాకీవెల్లీ
అబ్రహాంలింకనూ
మీ నిర్వచనాలు మార్చుకోండి
లారీల కోసం
లారీల వలన
లారీల చేత
నడిపేదే ప్రజాస్వామ్యం



# మళ్ళీ మనుషులుగా పుడదాం.

రెండు వైర్లను కలిపి
టైమర్ బాంబులు పేల్చగలరు కాని
రెండు పెదాలను కలిపి
నవ్వులతోటలను పూయిస్తార్రా?
మనిషంటే రక్తమాంసాలే కాదు
ఆలోచనల కదలిక
బాంబులతో తలలులేని మొండాల్ని
తునాతునకలైన వంటిని
నెత్తుటి మడుగుల్ని చేయవచ్చు
గోకుల్ చాట్ బండారులో
పయిటాల చిరుతిళ్ళకోసం వచ్చినోళ్లు
మాటలు పూసులల్లుకునేవేళ
ఏంజరుగతదో తెల్వదు
అక్కడ బోసినవ్వులున్నాయి
పసిమనసుల తోడులున్నాయి
ఎన్నో కలల గూళ్ళున్నాయి
ఒక్కసారిగా దేహాలు పేలాయి
ఒక నెత్తుటి మడుగుపై దేన్నికడతారు?
ఒక మతం మీద, ఒక కులం బండ మీద

ఏ జాతి మొలవదు
మీరు యుద్ధం చేయడానికి
అది కాళింది మడుగు కాదు
కాస్త ఆకలితీర్చే గోకుల్ చాట్‌బండార్
కళ్ళకు కాంతులిచ్చే లేజర్ షోల
లుంబినీ వనాని కంటిన నెత్తురును చూడలేక
బుద్ధుడు తలతిప్పేసుకున్నాడు
మీరు విధ్వంసాల నుంచి మనిషిని పుట్టిస్తారా?
మీ ధ్వంసాలనుంచి మానవత్వాన్ని పూయిస్తారా?
ఎవడినైనా చంపటం నేరమన్న
మతాన్ని స్వీకరిద్దాం రండి
ప్రేమతో పెట్టుకునే ముద్దును కోస్తార్రా?
మనుషులంతా కలిసి స్వేచ్ఛగా ఎగిరే
పక్షులగుంపు కావాలి
మానవత్వపు గూళ్ళు కావాలి
ఏమతమైనా మనుషుల్ని ప్రేమించమనే అంటది
మతోన్మాదుల ఇనుపగుళ్ళు
గుండెలనైతే పేల్చగలవు కానీ
గుండెలనిండా వున్న ప్రేమనెలాకూల్చగలవు?

అప్పటిదాకా నవ్విన నవ్వులు గుక్కపట్టి ఏడ్చాయి
రెక్కలు తెగి కొన వూపిరి కొట్టుకుంది
ఒరేయ్! నవ్వుల్ని నెత్తురు ముద్దలు చేసారు కదరా!
నవ్వులకు ఏడ్పులంటాయి
అవి పుత్రశోకాలయ్యాయి

తల్లులులేని బిడ్డలయ్యాయి
రాలిన కుంకుమ పువ్వులయ్యాయి
తెగిపడ్డ తల్లిపేగులు గుక్కపట్టాయి
నవ్వులకు పేలుడు వొత్తులు పెట్టారు గాని
మళ్ళీ ఆ పెదాలమీద మాటను పుట్టిస్తార్రా
పేల్చటం, కూల్చటం మాత్రమే తెలిసినోడికి
నవ్వుల మానవ తోట నిర్మించటం తెలియదు
మానవత్వపు బాటలు వేయలేదు
పేల్చండి పేల్చండి మీరెన్నైనా పేల్చండి
సహజీవనానికి చావు లేదు

ట్రైమర్లతో మీరు బూడిద చేయగలరు
నాకవిత్వమనే ఫినిక్స్ పక్షి మనుషులను
బూడిదలోంచి మళ్లీ మళ్లీ పుట్టించగలదు

మందిరాలం, మసీదులం కాదు
రక్తమాంసాల దేహాలయాలం మనం
మనమంతా ప్రేమగా విరబూసే వాళ్ళం
అడ్డుగాకట్టిన గోడలను పగులకొట్టి
ఏకమయ్యే దేహం మనది
నెత్తుటి దోసిళ్లతో నేనేప్రార్ధనా చేయలేను
మందిరాలకు రక్తాభిషేకాలు చేయలేను
ఎవరెన్ని రాళ్ళతో కొట్టినా నేను మనిషిని కౌగిలించుకుంటాను
ఎన్ని శిలువలు ఎక్కించినా
రక్తం కార్చే మనిషికి కట్టునౌతాను
చరిత్ర ముమ్మాటికీ మనుష్యులదే

మతాలిది కాదు
మానవజాతి చరిత్ర మతాల నెత్తుటి
మడుగు కాదని మూగుదాం రండి
మనందరం మనుష్యులుగా పుడదాం
ఉన్మాదమే సిగ్గుతో చచ్చిపోవాలి
మనుష్యుల్ని ప్రేమించే మతం స్వీకరిద్దాం రండి
చెదిరిన పిట్టల గుంపు మళ్ళీ మన వూళ్ళో
పీర్లకొట్టం కాడ కలుస్తది

వాళ్ళేమి చేస్తున్నారో వాళ్ళకు తెలియదు
క్షమించు ప్రభూ.....
అల్లా దయామయుడు, ప్రేమ స్వరూపుడు
సర్వేజనా సుఖినోభవతు



# ప్రాణాక్షరాలు

సిగ్గును వదిలేసిన ధృవానికి
లజ్జ గుడ్డ కట్టాల్సింది అక్షరమే
బరితెగించి మీదపడ్డ మూర్ఖత్వానికి
తిరిగి జ్ఞానం ప్రసాదించేది అక్షరమే

మూఢత్వం ఎన్నిసార్లు ఎగిసిపడలేదు
చాదస్తానిది ఎప్పుడూ చరిత్ర కాదు
గెలిచి నిలిచి బతికింది అక్షరమే

అక్షరాలపై దొంగదాడులు పాతవే
అక్షరాలపై రెక్కలిప్పుతున్న
ఎన్నెన్ని సీతాకోకచిలుకల్ని వధిస్తారు

ఎన్ని రాళ్ళేసిరినా
ఎన్ని శిలువలెక్కించినా
అక్షరాలు మాత్రం
తొలుచుకొచ్చె మొలకలే
చిగురులేసే యిగుర్లే
నీటిబొట్లను పలగ్గొడితే సంద్రాలు
అక్షరాలను చంపితే అవి మహాకావ్యాలు

అసలు తిరగబడంది అక్షరానికి జననం లేదు
దేశాల దేహాలకు అక్షరాలు ప్రాణవాయువులు
అక్షరాలకు వస్త్రాపహరణాలు
చేయని ప్రభుత్వాలు లేవు
అక్షరాలు యుద్ధక్షేత్రాలు కాని నేలంటూ లేదు
దాడుల నుంచి
ధ్వంసాల నుంచి లేసిన
ఆ అక్షరాలే కొత్త నిర్మాణాలు
రాళ్లు కొట్టి చంపాలనుకొన్న
దేదైనా మళ్లీ పొద్దుపొడుపే

అక్షరాల్ని చంపుతామని
ఎవరూ ప్రకటనలు చేయకండి
అక్షరాలకు చావులేదు
అక్షరాలు జులియస్‌ఫ్యూజిక్
ఎర్రకళ్లలా ఉంటాయి
తస్లీమా నస్రీన్ అమాయకపు
చూపుల్లా ఉంటాయి
ఆకాశంలో సగమైన
ఆ చూపుపైన తెగబడ్డ తనం చూసి
ప్రపంచమంతా ఒక్క కుదుపుకు
గురి కావటం కదా అక్షరమంటే

మనుషులెప్పుడూ అక్షరాల్లో
బతకాల్సిన వాళ్లే
బతుకుకు ఆధారం అక్షరం

ప్రాణాల్ని అక్షరాలు చేసి
ఎగురవేద్దాం రండి

మతం, కులం
వెంటనే కూల్చాల్సిన గోడలు
దేహాలన్నీ దేవాలయాలే
రక్తమంతా ఒకటే
కాలాలు మారినా
దేశాలకు పదలంది మతం మత్తే
కులమతాలు లేని
సమాజాల్ని కట్టుకుందాం రండి

రాజకీయ నాయకులు
సమాజానికి తామే అధినాయకులమనుకుంటారు
కానీ
కవులూ, కళాకారులే
అసలైన అనధికార శాసనకర్తలని తెలుసుకోలేరు
అక్షరమంటే మానం
అక్షరమంటే మానవి
అక్షరమంటే ప్రాణం
క్షరము కానిది అక్షరము
తస్మాత్ జాగ్రత్త!



# నా కలల తెలంగాణ

తెలంగాణ మట్టి బిడ్డల
పాదాలకు మొక్కి
వాళ్ల మనసులో జాగా పొందినోళ్లంతా మహానేతలైంద్రు
ధోకా చేయటం తెలియని
మా గోసిగుడ్డల అవ్వల అయ్యలు దీవిస్తేనేగా
మీరు జాతి నేతలయ్యింద్రు

మా సదానందమన్నట్లు    దేవేంద్రా
ఆ కాల్పులన్నీ బూటకమని గొంతువిప్పు
ప్రజాస్వామ్య తెలంగాణ పాట పాడు
ఈ పొక్కిలైన నేల నుంచి వచ్చినోళ్లే
పదవుల్ని రాలిన వెంట్రుకల్ని చేసి పారేస్తరు

కెసీఆర్ రాజీనామాలన్నప్పుడల్లా
ఉద్యమ పొత్తిళ్లల్లోకి రా బిడ్డా అని పిలిచినోణ్ణి
పాలపిట్టరంగు జెండాను నోరారా పిలుస్తున్నా-
వాకిళ్ల ముందు తెలంగాణ ముగ్గేద్దాం
మన పెరళ్లలోని స్థానికతను తవ్వి బచ్చలాకు చేసి పందిరేద్దాం
ఈ మట్టిది పోరు అక్షరమాల
మన తల్లులు జన్మనిచ్చి
తిరగబడటం నేర్పింద్రు
ఉగ్గుపాలల్లో ఆత్మగౌరవాన్ని నూరిపోసింద్రు

బిగించిన పిడికిళ్ల నిచ్చిండ్రు
మన తండ్రులు కుట్రలు నేర్పలేదు
శత్రువులకు ఆసరా కావొద్దన్నరు

మన జెండా తెలంగాణ పటం
భావాలు ఎన్ని జెండాలైనా కానియ్
ఫికర్‌లేదు-
విడివిడిగా విడిపోయి
ఏకమౌదాం-
మనందరం తెలంగాణ చౌరస్తాలో కలుద్దాం
అన్ని దారుల్లోంచి వచ్చి
మహా తెలంగాణ రస్తాలో కలుద్దాం
ప్రాంతీయ దేశభక్తుల
జాబితా తయారు చేస్తున్న
ఉద్యమ గణాంకశాఖను నేను
కవిత్వాన్ని రెక్కలకు కట్టుకొని
ఎగురుతున్న తెలంగాణ జాతీయ పక్షిని-

నీళ్లు, నిధులు, ఉద్యోగాలు
ముంబయ్, బొగ్గుబాయి, దుబాయ్
ఫ్లోరోసిస్‌తో పోరుభూమి వంకర్లు
బిడ్డల్ని అమ్ముకుంటున్న నా జొన్నరొట్టెలు
అడవిలో నెత్తుటి రంగేసుకున్న చెట్లు
ఆధిపత్యానికి తలకొరివి ఎవరు పెట్టినా
మన స్వపరిపాలన గేట్లు ఎవరు తెరిచినా
ఆత్మగౌరవ నినాదమై ప్రతధ్వనిస్తాం-
నినాదాల నుంచి
ఓట్ల జాతర్ల నుంచి

ఉద్యమబాట కొచ్చే వాళ్లందరికి వాలేకు సలామ్-
మనం సచ్చుడో బతుకుడో
తెలంగాణ వచ్చుడే
దాన్నాపటం ఎవనితరం కాదని తేల్చుదాం

వచ్చే తెలంగాణ ఎట్లుండాలో
ఇపుడే గీసుకుందాం-
తెచ్చుకునే తెలంగాణ ఎట్లుండాలో
ముందే రాసుకుందాం-
నా కన్నీళ్లకు సమాధానాలు కావాలె
దొడ్డి కొమరయ్య నెత్తుటికి జవాబుకావాలె
బువ్వ గింజల ఐలమ్మల బతుకులు మారాలె
వూరుకు వాడకు మధ్య బెర్రలు సెరపాలె
బహుజన తెలంగాణ యాత్ర మొదలుకావాలె
పౌరహక్కులు గాయపడని నేల కావాలె
ఖాళీ అయిన వూళ్లు మందితో కలకలలాడాలె
మన సెరువులు బతకాలి
అధునిక దొరల పెత్తనాలొద్దు
గుండెనిండా ఆత్మగౌరవం
ఆపకండసేయ్...కబాడీ కబాడీ....
మనకు వూరికి
పిడికెడు మంది ప్రకాశం పంతుళ్లున్నరు
గల్లీగల్లీలో కొమరం భీమ్‌లున్నరు
ఉద్యమాలకే వన్నెతెచ్చినోళ్లున్నరు
మాకు సావులు కొత్తకాదు
సమ్మక్క సారక్కలమై పుడుతునే ఉంటం-

ఉద్యమానికి జీవం పోసి
అడుగులేసే వాళ్లను ఈనేల కౌగిలించుకుంటది
వాదాన్ని చీల్చకుండా
ఉద్యమాన్ని ఎగురవేద్దాం...రండి
ప్రాంతీయ దేశభక్తుల్ని ఆపటం ఎవనివల్లా కాదు
ఈ మట్టి మీద వొట్టు పెట్టి చెప్పు
దేశానికే ఎర్ర జెండానిచ్చింది ఈ నేలేగా
రాఘవులూ మనసు మార్చుకోవా!?
ప్రత్యేకతపై అస్థిత్వ సంతకం చేయవా?

అమ్మతోడు
సురవరం నిశాని ఏసిండు
నారాయణ ఎప్పట్నించో అరుస్తనే వుండు

సరైన సమయానికి సరైన నిర్ణయం దేవేంద్రునిది
కాదంటావా చెప్పు బాబూ!
చెన్నమనేని మొఖమాటం లేకుండా తెగేసి చెప్పిండు
దత్తన్న తెలంగాణకు కొండంత అండగుంటనండు
పెద్ద మనుషులు కాకా, పురుషోత్తములు చెప్పినంక
గింతకంటె మంచి సమయమొస్తదా
ఎవని గూటిలోనో ఉండి
మనపాట పాడుడేంది
మన నేల పాటే మన జెండా
జొన్న రొట్టెల మీదొట్టు మనం గెలుస్తమే
బతుకమ్మ మీదొట్టు మనం నిలుస్తమే

# వీరీవీరీ విరసం

నీ పేరు వినగానే
మొగిలిపూల వాసన...
ఇప్పపూల అందం...
ఈ నేల అందాలు కన్న కలవు నువ్వు
నువ్వు పొద్దుకు కిరణజన్యసంయోగక్రియవు
నువ్వు పురిట్లో బిడ్డ కేకకు నవ్విన బోసినవ్వువు
కాలవగట్లంట
పల్లేరుకాయల దారుల్లో
ఎర్రసెలకల్లో
బురదమళ్ళల్లో
నాట్లేసే లచ్చుమవ్వ
బురదకాళ్ళ పాటల్లో
మడుగుల్లో... వరికుప్పల్లో
ఏరుకునే రాగి ఆకుల్లో
ఒక నిశ్శబ్దం లోంచి
ప్రళయశబ్దం చేస్తూ
సహజంగా వాలిన జలపాతానివి
ఒక నదీలోయ ఒంపుల వయ్యారాల
ముడతలు పడ్డ మడతవే నువ్వు
ఆ రోజుల్లో నిన్ను చూస్తూ

నీదారెంట నడుస్తూ
నీ అడుగులను అందంగా దిద్దుకుంటూ
నీవు చెప్పిన గుసగుసల మాటల్ని
తెగిన నిద్రల్లో పలవరించి కలవరించి...
నిజంగా అప్పుడు నాకెందుకో
నువ్వంటే పిచ్చి ప్రేమ!
నీ అందని సౌందర్యం వెంటపడి
చెడ తిరగాలనిపించి
నిన్ను వదలకుండా
నీ కౌగిలిలోనే కరిగిన కావ్యాన్ని కావాలని
నీ వెంటపడితే నాకు వేటే!
అయినా భయాన్ని జయించిన ధైర్యం
నీ దారెంటే పరుగు... పరుగు.... పరుగు
ఎందుకో అప్పుడు చదువుకునేటప్పుడు
రక్తం ఎందుకు ఉరకలేస్తదోనన్నది
నీ పాఠం!
భావాల కొంగుల పొంగులు
మా ముఖాల మీంచి అలా
పైటకొంగులా నిమురుకుంటూ పోతుంటే
పాఠంలోని ప్రతి పదాన్ని
జీవితంగా మార్చి
ఒక దిశానిర్దేశం చేసిన
సొగసరివే నీవు
నువ్వు అడుగులేస్తూ పోతుంటే
నదుల అలల్లా లేచిదరిచేరి
మళ్లీ అప్పటికప్పుడు అంతమై

అవతరించే వాణ్ణి
నిజంగా!
నువ్వు చావుపుట్టుకల మర్మం
నిన్ను చూస్తూ
నీవెంట పడుతున్నప్పుడు
ఏ భయమూలేదు
ఎందుకంటే... నిన్ను చూస్తుంటే
విరగబూసిన తుపాకుల
తోటలా ఉండేదానివి
కపటం లేకుండా పగలబడి నవ్వే
అడవి అందానివే నీవు
నువ్వు మా ఊరిబావి మంచినీటి జలవే!
పోతులూరి వీరబ్రహ్మం వచనానివే నీవు!
నిజంగా... నిన్ను తలచుకుంటే చాలు
అలసట లేని ఆనందం
నువ్వు ... జొన్న చేలో దోసకాయవే!
నువ్వు... సెనగచేలో కందిచెట్టువే!
మా ఇంటిపైకి ఎగబాకిన బచ్చలాకువే!
మా ఊరి సెర్లో కనిశపిల్లవే!
మమ్మల్ని బతికించిన తల్లివేరువే!
పీర్లగుండం కాడ అస్సోయి దూలవే!
కానరాకుండా కొల్లగొట్టిన మనసువే!
నన్ను లేపుకుపోయిన చెరిగిపోని కలవే!
నిన్ను తలుస్తునే ఉన్నా
నిన్ను కలుస్తునే ఉన్నా
నిన్ను వదలకుండానే ఉన్నా

అంటరాని వసంతాలు
చలినెగళ్ళు
ఓ గోచిగుడ్డ పరచిన గొంగళి
నీకూనాకూ మధ్య...
నీ కలల్ని నిత్యం కాస్తూనే ఉన్నా
నీ పొరాల్ని మరగబెడుతూనే ఉన్నా
నాకు ఎప్పటికీ మర్చిపోని తొలిముద్దువే!
నా తప్పటడుగుకు నడక నేర్పిన చేయివే!
నా నుంచి నీవు ఎప్పుడు దూరమయ్యావో...
మనిద్దరి మధ్య ఎడబాటు ఎట్లయిందో?
ఈ తుపాకీ స్వప్నం నుంచి
నేనెప్పుడు జారిపోయానో?
ట్రిగ్గర్ నొక్కే వేళ్లపైన
కులం స్టిక్కర్లు ఎవరంటించారు?
మనిద్దరి స్వేచ్ఛా గాలి మధ్య
కుల తెరల్ని ఎవరు కట్టారు?
ఈ నేల స్వప్నాలు
ఎందుకిలా పొక్కిలయ్యాయి?
ఇన్నేళ్ళ కలలు ఎన్నెన్ని ఉద్యమ సాగరాలయ్యాయో!
నీటిబొట్టు కోసం చాచుకున్న నాలుకలు!
వాకిళ్ల ముందు వలసల గీతలు!
జీవితాల ముందు ప్రపంచీకరణ
బతుకు ముందు మళ్లీ నీ సౌందర్యం
నన్ను విసుగెత్తించావా
ఏమో! నేను నా నేలపాట పాడుకుంటూ
ఊరి బయట బొర్రలు చెరుపుకుంటూ

కాగితాలపై గీసుకుంటూ
ఏవో.... నా పాటలు నేను పాడుకుంటూ....
నా చేతులకేసిన పరాయి సంకెళ్లను
పగులగొట్టుకునే పెనుగులాట
ఇగో... ఈ బందీఖానా నుంచి
బయటపడేందుకు మందినై వస్తున్నా
కూడగట్టుకున్న కోపాన్ని మూటగట్టుకొని వస్తున్నా
ఇప్పటివరకు ప్రేమించి వెంటపడ్డ
విరసం కూడా నా వెంటపడి
జై తెలంగాణ అంటోంది
అందుకే... మళ్లీ నా ప్రేమలోకి.... నేను
నా కంటిసూపు తెలంగాణలోకి... నేను
నా కలల వాకిళ్ళ తెలంగాణలోకి నేను
ఇగో... విరసానికి
ఈ బతుకమ్మ పాట!

---

మా అమ్మా నాన్నలు యార్లగడ్డ కస్తూరి, రామనాథంల
60వ వివాహ వార్షికోత్సవం సందర్భంగా
ఈ పుస్తక బహూకరణ
ఫాంట్‌లైన్ (యార్లగడ్డ) [illegible]ర్మల, వై. సుబ్బారా[illegible]
[illegible]

